# ఆంధ్రభూమి

S.D.RAO

6

జూన్, 1942

వెల 2 అణాలు.



మేలిముసుగు మెలతలు.

ప్రశస్తమైనవి నమ్మకమైనవి

# ఆయుర్వేదౌషధములు

ఎచ్చట

లభించును?

ఆర్షరసాయనశాల, ముక్త్యాల

శ్రీ వేటూరి. సుందరశాస్త్రిగారి.

# సువర్ణసుందరరసము

సర్వ

సవామేహములకు

సంజీవి వంటిది.

ఆర్షరసాయనశ్శాల. ముక్త్యాల. కృష్ణా.

*Consulting Physician :—*

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకరశాస్త్రిగారు, ఎ.ఎం.ఎ,సి.

ఆంధ్రభూమి

సంపుట : ౧౦. చిత్రభాను, ఆషాఢము : జూన్, 1942. సంచిక : ౮.

# ఆత్మదేశంకోసం మానప్రాణాలు అర్పించిన గూఢచారిణి మేరీ సోరల్

ఈ మహాఘోరయుద్ధంలో ఫిఫ్తుకాలమ్ అపరిమితమైన మార్పులు తీసుకువస్తూవున్న విషయం చదువరులు ఎరిగినదే.

ఫిఫ్తుకాలమ్ అన్నా, సిక్స్తుకాలమ్ అన్నా, స్పైయింగు అన్నా దానిని తెలుగులో చెప్పాలి అంటే గూఢచారి ప్రవర్తన అనాలి. శత్రుపక్షం వారి చెప్పుచేతలలోవున్న కొందరి వ్యక్తుల ప్రవర్తనముని నిర్వచించాలి.

యుద్ధకాలంలో శత్రువుని యొక్క రహస్య ప్రయత్నాలు కనుకొని మాతృదేశానికిగాని, పితృదేశానికిగాని తెలియజేస్తూ అపారధనము ఆర్జించుకున్న గూఢచారులు అనేకమంది వున్నారు. నేడుకూడా వున్నారు. వీరు ఆత్మదేశాలనువిడిచివచ్చి పరదేశాల్లో పాదుకుని అక్కడివారిలో లీనమైపోయినట్టు కనుపిస్తూ యుద్ధసమయాల్లో తమ స్వదేశాభిమానం, వ్యక్తం చేయడానికిగాను రహస్యంగా తాము ఎక్కడ తలదాచుకొనియింతకాలం జీవించారో ఆ దేశరక్షణలకు భంగకరంగా ప్రవర్తించి ఆ దేశరక్షణ విధానాలను ఇతరులకు అమ్మి తమ జీవితములనుకూడా కోలుపోయిన స్వదేశాభిమానులు వేనవేలు కలరు.

స్వదేశంలో ప్రభుత్వముపై కుట్రలు పన్నకుండా చూడటానికి ఇంగ్లాండులో స్కాట్లండుయార్డు, జర్మనీలో గెస్టాఫో, రష్యాలో ఓగ్‌ప్యూ మొదలైన గూఢచారి సంస్థలువున్నట్టే ఇతర దేశాలు తమమీద ఏమైనా పన్నాగాలు సాగిస్తున్నదీ; ఇతర దేశాల నౌకాబలాలలోను, సైనికబలాలలోను, యంత్రనిర్మాణంలోను నూతనమైన మార్పులను రహస్యంగా సేకరించుటకు ప్రభుత్వము అపారమైన ధనము వెచ్చించి యితర దేశాలలో తమ ఏజంట్లను నిర్మిస్తారు. ఆ ఏజంట్లు శాంతిసమయములలో తప్పించుకు పోతారు కాని యుద్ధకాలంలో పట్టుబడితే వురికంబము ఎక్కవలసివుంటుంది.

బ్రతికివున్నన్నాళ్ళు అపారమైన ధనము నార్జించి స్వదేశాభిమానముతో మానమును సహితము ధారపోసి తుదకు మృత్యుదేవత ముద్దుబిడ్డలైనందుకు

రచయిత :

కొత్తపల్లి శ్రీరామమూర్తి

వారు ప్రశంసింపదగ్గవారే. ఏ దేశమునకు అట్టి వీరులు అండగా వుంటారో ఆ దేశము ఎన్ని యుద్ధములందైనా విజయం పొందుతుంది.

కాని గూఢచారివృత్తి కత్తిమీద సామువంటిది. అది ఒక అసిధారావ్రతచర్య వంటిది. అది మోతాదుతప్పినా, అజాగ్రత్తగావున్నా ఆ వ్యక్తి జీవితనాటకం ఆనాటితో సమాప్తమే.

శత్రువులకు దేశరక్షణకు భంగకరమైన భోగట్టాను అందజేసినందుకు ఈ మధ్య అమెరికాలో అనేకమంది గూఢచారులు శిక్షింపబడ్డారు. దానికి ఇంటర్‌నేషనల్ స్పైట్రయల్ అన్నారు. జెక్ దేశంలో హైడ్రిచ్‌ని హత్యకావించడానికి జరిగిన ప్రయత్నము వెనుక అక్కడ జరిగే ప్రళయనృత్యం జర్మన్ విరోధుల అదుపులోవున్న గూఢచారులను చంపుటకే.

1914-18 యుద్ధానంతరం ఫ్రాన్సులో చంపబడిన గూఢచారులు అసంఖ్యాకులు. రష్యాలోకూడా అన్యదేశీయుల గూఢచారులను వేటాడి చంపేస్తారు. గూఢచారి జీవితంలో అప్రతిహతుడగు హెర్ గస్టవ్ స్టీబర్ అనే జర్మన్ గూఢచారిచక్రవర్తి,

1914 యుద్ధకాలంలో తనఅనుభవాన్ని గురించి అతడు ఒక పుస్తకం వ్రాశాడు. అతనికి మాస్టరు స్పై ఆఫ్ కైజర్ అని బిరుదము వున్నది.

అంగులో పోలిష్ మేరీ అని పిలువబడే ఒక జర్మన్ వనితను గురించి వ్రాస్తూ ఆమెగూఢచారిగా పనిచేసి మరణించినవిధం వర్ణించాడు. అది చాలా చమత్కారంగాను, విషాదంగానుకూడా వుంది. అది క్లుప్తంగా పొందుపరుస్తాను. దానినిబట్టి చూస్తే గూఢచారి ప్రవర్తన ఎంత కష్టమైనదో ఎంత విషాదకరమైనదో విశదంకాగలదు.

1914 నాటికి యుద్ధపుపొగలు చెలరేగుతున్నాయి. ఇంగ్లాండు జర్మనీపై యుద్ధము చేస్తుందా లేదా అన్నది ఒక పెద్ద సమస్య అయినాడు. దానిని కనిపెట్టడానికి జర్మన్ గూఢచారులు వేయి కన్నులతో చూస్తున్నారు.

ఇంగ్లీషు నౌకలు డెన్మార్కు టెరిటోరియల్ వాటర్సులోకి వచ్చి విల్హెల్మ్‌షేవా కెయిల్ ప్రాంతములో వున్న జర్మన్ నౌకలు ఏం చేస్తున్నది కనిపెట్టసాగాయి. డెన్మార్కు తాటస్థ్యమునకు అది భంగకరమైన విషయం.

జర్మన్ నౌకాధికారులు స్టైన్‌హార్‌ని పిలచి బ్రిటిష్‌నౌకలు డెన్మార్కుప్రాంతముకు ఎందుకు వచ్చినది కనిపెట్టమని ఆజ్ఞాపించారు.

కాగా స్టైన్‌హారు వంటరిగా డెన్మార్కుకుపోతే గూఢచారిగా అనుమానిస్తారన్న భయంచేత ఏదేనా సాకు చెప్పడానికి అనువుగా వుంటుందని తన ఆరేండ్లకుమారునికూడా చంక పెట్టుకొని పోయాడు డెన్మార్కు పోలీసు లెవరైనా అతన్ని ప్రశ్నిస్తే కుమారునికి స్కేజెన్ జలపాతం చూపించడానికి వచ్చానని చెప్పదలచుకొన్నాడు స్టైన్‌హార్.

అతనికి డేనిష్‌తీరాన్ని బ్రిటిష్‌నౌకలు కనిపించలేదు కాని అనేకమంది ఫ్రెంచి, రష్యన్, యింగ్లీషు గూఢచారులు ఆ తటస్థదేశంలోవున్నట్లు వాసన గొట్టింది. వారందరూ డేనిష్‌ప్రజల స్నేహమునకై తహతహలాడి పోతున్నారు. డేనిష్ వారికి ఇంగ్లాండుపై అభిమానం హెచ్చు అప్పట్లో. గూఢచారులకు క్రీడారంగ మట ముఖ్యంగా రెస్టరెంటులు స్టైన్‌హార్ తన కుమారునితో ఆరహస్ నగరంలోని ఒక హోటల్‌లో చొరబడ్డాడు. అతని ఆరేండ్ల కుమారుడు అతిగా వాగుతూవుండేవాడు. అది సంధ్యాసమయం సాయంకాలపు భోజనం చేదామని ఒక బల్లవద్ద స్టైన్‌హారు కుమారునితో కూచున్నాడు. స్టైన్ సాధారణంగా నాలుగువెంపుల పరికింపనిదే కూచోడు. స్టైన్‌హారు నాలుగువైపులకు చూచాడు. అతని నిశితదృష్టి సమీపంలోనే ఒక సుందరాంగి ఒక మగవానితోకలసి మరి ఒక బల్లవద్దవుండడం కనిపెట్టింది. అతని దృష్టికి ఆమె ఒక గొప్ప నటివలె కనుపించింది. క్షణంలో ఆమె తన ముఖలక్షణములను మార్చివేస్తోంది. గూఢచారి చక్రవర్తి స్టైన్‌హార్ ఆమెను క్రీగంట కనిపెట్టడం ప్రారంభించాడు. ఆమె ముఖంలో వినమ్రత, చురుకుతనం, చమత్కృతి ఒకదానివెంట ఒకటి ద్యోతకమైయాయి.

ఆమె ఎదటవానితో తడుముకోకండా యింగ్లీషుమాట్లాడుతూవుంది. అప్పటప్పట డేనిష్‌భాషలో సంభాషిస్తూవున్నది. ఆమెతో ముచ్చటించేవాడు ఒక యింగ్లీషు గూఢచారి. ఆమె గూఢచారిఅని అతనికి తెలియదు. వారుయుద్ధవిషయములనుగురించి ముచ్చటించుకొనసాగారు. వారు రష్యాయుద్ధరంగమును గూర్చి చర్చిస్తున్నారు. వారి సంభాషణలో అప్పటి రష్యాప్రభువు గ్రాండ్‌డ్యూక్ నికోలాస్, రష్యాజనరల్సు డిమిత్రీ మార్టన్‌ల పేరులు దొర్లసాగె. ప్రక్కవారంతా డేనిష్ జాతివారని మన సంభాషణలు యితరుల కర్థంకావని వారు యింగ్లీషులో, గట్టిగానే మాట్లాడుకొన్నారు. ఆమె ఒక గొప్పనటకురాలైతే మన స్టైన్‌హార్ గొప్ప నటకుడు. పూరికే కూర్చుని వారి సంభాషణ వినుచున్నట్టు తెలియకుండా వుండాలని కుమారుని మెడకు ఒక జేబురుమాలు ముడివేసి అతనికి ఉపచారం చేస్తున్నట్లునటిస్తూ ఆమె సంభాషణ నిశితంగా వినడం ప్రారంభించాడు.

ఆమె సంభాషణ ముగిసాక ఆమె సంచీలోనుంచి ఒక నోటుబుక్కు తీసుకొని అందులో ఆమె స్నేహితుడు చెప్పిన కొన్ని విషయాలు నోటుచేసుకొంది. ఆ సందర్భంలో ఆ సంచిలోనుండి ఒక విజిటింగ్ కార్డులాంటి కార్డు క్రింద పడిపోయింది. ఆ కార్డు తనకు దొరికితే ఆమె ఎవరో కనిపెట్టవచ్చును కదా అని స్టైన్‌హారు తహతహపడ్డాడు. ఆ కార్డు తానుపోయితీసి చూడటం అనుమానస్పదంగా, అసభ్యంగా వుంటుంది. అందుకు ఒక చిన్న చిత్రనాటకం ఆడాడు. ఆరేండ్ల తన కుర్రవాని చెవిలో జర్మన్ భాషలో "ఏమరుగుండా ఆ బల్లక్రిందపడిన కార్డు తీసుకురావాలి సుమా అని" వూదాడు. కుర్రవాని

అట్లా చెప్పినవెంటనే పంట్లాం జేబులోనుంచి జేబురుమాలు పైకిలాగుతూ దానితోపాటు కొన్ని డబ్బులు క్రింద పారవేసాడు. ఆకుర్రవాడు ఆ డబ్బులు ఏరుతున్నట్టు నటించి ఆకార్డుకూడా తస్కరించి తీసుకువచ్చి తండ్రి బల్లపై పెట్టాడు డబ్బులతోపాటు. ఆ హాల్లో ప్రక్కనున్నవారు కూడా కుర్రవానికి డబ్బులు ఏరి యిచ్చారు. కాని స్టన్‌హారు డబ్బుల వంకే చూడలేదు. ఆకార్డు బల్లమీద పెట్టగానే స్టన్‌హారు దానిమీద ఏమున్నది చదవబోయాడు కాని అవి అతనికి కొరుకుపడలేదు. వెంటనే అతడు ఒక న్యూసుపేపరు తీసి చదువుతున్నట్టుగా ముఖానికి అడ్డంపెట్టుకొని ఆ కార్డుమీదవున్న అక్షరాలు ఒక డ్రాయింగు మాదిరిగా ఆపేపరుమీద వ్రాసేశాడు.

స్టన్‌హార్‌కి ఆ కార్డును గురించి కొడుకు గందరగోళం మొదలుపెడతాడని గుడుకుగా నేవుంది. కునుకు నక్కపైతాటిపండన్నట్టు కుమారుడు దాన్ని గురించి అడక్కపూర్వమే ఆ విచిత్ర వనిత స్వయంగా అతని టేబిల్ వద్దకు వచ్చి 'నా కార్డు తీసుకొందునాకి?' అని అంది. ఆమాటలతో స్టన్‌హారు గుండెలు చలించాయి. రహస్యం కనిపెట్టేసిందని భయపడ్డాడు కాని యిల్లాంటి వన్నో చూచిన ఆ వ్యక్తి పైకి బింకంగా 'నీవు చెప్పేది నాకర్థం కాలే'దన్నాడు. మరల అడిగింది నా కార్డు నేను తీసుకొందునా అని. ఒక పెద్ద బొంకు బొంకాడు స్టన్‌హారు ఆ కార్డు విషయం తన కేమీ తెలియదని. "నాన్నా! నీవు తీసుకురమ్మన్న బొమ్మ యిదే" నన్నాడు అమాయకుడైన కుర్రవాడు. కోపంవచ్చి వాడి దవడ విరగొట్టాడు స్టన్‌హారు. ఆమె ఆపిల్లవానిని వోదారుస్తూ యిది బొమ్మకాదు. ఒక ముఖ్యమైన ఎడ్రసు కార్డు అని స్టన్‌హారువంక తీక్షణంగా చూస్తూ మందహాసం చేయసాగింది.

అక్కడవారందరు ఆ ఉభయుల వంకా చూడసాగారు. స్టన్‌హారుకి ప్రాణం వచ్చిపోయినట్లయింది.

ఆనాటిరాత్రి అతను తన గదికి పో

తూవుంటే ఆమె ఎదురుపడి గుడ్ నైట్ ౘాలీగ్’ అని హేచ్చరిస్తూ వెళ్ళిపోయింది. అది పోలిష్ మేరీకి గస్టవ్ స్టన్ వారిక్ కలిగిన ప్రథమ సమాగమము.

రెండవసారి ఆమె కోపెన్ హేగన్‌లో హోటల్లో తిరిగి కలుసుకొన్నాడు. ‘గుడ్ ఈవెనింగ్ ౘాలిగ్’ ఆమె అతని టేబిల్ వద్ద కూచుని. సంభాషణలో దింపి అతడు ఇదివరకు ఆర్‌హస్‌లో దొంగిలించిన కార్డుమీద విషయాన్నిగురించి చెప్పనా అంది ఆమె. “అక్కరలేదు. దానిమీది విషయం నాకు యిదివరకే తెలుసునన్నాడు” స్టన్ హార్. ఆమె దానితో నిశ్చేష్టురాలై పోయింది. కొంత తడవు అప్పటి ఆ సంభాషణలో అతన్ని బుట్టలో పెట్టలేక ఆమె వెడలిపోయింది. ఆమె తన అసమానలావణ్యంచే యింగ్లీషు ఫ్రెంచి రష్యన్ సేనానులతో సంబంధములు ఏర్పరచుకొని వారి రహస్యములను సేకరించేది. కోపెన్ హేగన్ నుండి ఆమె బెర్లిన్‌నగరం వెళ్ళింది. ఆమెను కోపెన్‌హేగన్ స్టేషన్‌లో స్టన్ హార్ కలసికొన్నాడు. తనపని ముగించుకొని అతడు బెర్లిన్ చేరాడు. ఆమెను బెర్లిన్‌లో వుండగా పట్టి బంధించాలని విశ్వ ప్రయత్నం చేసాడు కాని విఫలుడైనాడు.

1915 ఫిబ్రవరిలో స్టన్‌హారు ఒక గూఢచారుని పట్టుకొనుటకుగాను డానిజిగ్ నగరం వెళ్ళాడు. అక్కడ అకస్మాత్తుగా పోలిష్‌మేరీ ఒక జర్మన్ జనరల్‌తో కులాసాగా షికారు పోతుండగా చూచాడు. స్టన్‌హారు నిర్విణ్ణుడైపోయాడు. అప్పటివరకు ఆమె ఎవరో స్టన్‌హారుకి తెలియదు. ఆమె ఒక గూఢచారిణి యనిమాత్రం అతనికి రూఢిగా తెలుసు. కాగా జర్మన్ జనరల్‌కు ఆ విషయం తెలపాలని పొంచి వారి వెనువెంటనే అనుసరించాడు. జనరల్ ఆమెను ఆమె బసయందు దిగవిడిచి వెడుతూవుండగా అతన్ని నిలిపి స్టన్ హారు ఆమె విషయం అతనికి విశదపరచాడు. అతడు అవి అన్నీ విని “నీవేమి భీతిచెందకు. ఆమె మన మనిషేను. ఆమె అపారమైన సేవచేస్తూ వుంది” అన్నాడు.

ఆ జర్మన్ జనరల్ ఆ త్యాగశీలినిని స్టన్‌హారుకి పరిచయం చేయడానికి అతనిని ఆమె యింటికి అహ్వానించాడు.

స్టన్‌హారు ఆమెను చూడబోయేసరికి ఒక రష్యను సైనికుని దుస్తులలో ఆమె అతనికి తలుపు తీసింది. ఆమెను గుర్తించలేక స్టన్‌హారు బిత్తరపోయాడు. ఆమె నవ్వుతూ తన దుస్తులు తీసి ఆమె నిజస్వరూపం చూపించింది. ఆమె నటనా కౌసలమునకు అచ్చెరు వొందాడు.

ఆమె రష్యన్ సైనికుని వేషంతో రష్యా సరిహద్దులు దాటి రష్యా జనరల్ రెన్ కాంఫ్‌తో పరిచయం చేసుకొని రష్యా రంగమందలి రహస్యములు సేకరించి ఛీఫ్ ఆఫ్ జర్మన్ జనరల్‌స్టాఫ్‌గా వున్న మాల్‌టకీకి అపారమైన సహాయం చేస్తూవచ్చింది. ఆమె సహాయంవల్లనే జర్మన్ సేనలు రష్యాసేనలను చీల్చి చెండాడకలిగాయి అప్పట్లో.

తుట్టతుదకు ఆమె సాహసమే ఆమెకు మృత్యుదేవత అయింది.

రష్యాసేనలు వైల్‌నగరమును కాళీచేసి పలాయనం చిత్తగించే సమయంలో శత్రువుల గూఢచారులని అనుమానించిన వారిని తొమ్మండుగురుని రష్యన్ ప్రభుత్వం ఉరితీసింది. అందులో పోలిష్‌మేరీ (లేక మేరీ సోరల్) ఒకతె.

ఆమె విషాదమరణం స్టన్‌హారును కూడా వూపేసింది. ఆత్మదేశ సేవకై తన జీవితమును తుదకు మానమునుకూడా వినియోగించి ఆనందంగా మృత్యుదేవిగర్భం చొచ్చింది ఆమె. నిజంగా ఆమె దేశాభిమానం ఆదర్శప్రాయం కాని ఆమె జాతీయత నిగూఢంగానే వుండిపోయింది. ఆమె పోలెండులోని లెమ్‌బర్గు బ్రోయ్‌బర్గు ప్రాంతములలో పుట్టినా ఆమె జర్మన్ జాతీయురాలు. ఆత్మదేశవిజయానికి జీవితాన్ని ధారపోసింది. స్టన్‌హారునకే ఆమె జీవితం విచిత్రంగావుంటే మనవంటి వారికి ఆశ్చర్యంగా వుండటంలో అతిశయోక్తి లేదు.

గూఢచారులవల్లనే దేశముయొక్క జయాపజయములు ఆధారపడివుంటాయి. శత్రువులు ప్రతికక్షుల దేశాలలో గూఢచారులకై వెతుకుతారు. ప్రజలు అట్టి వారికి లోబడడం కేవలం మృత్యుదేవతను ఆరాధించడం వంటిదే.

## రాజాజీ రహస్యం

తిరువల్వేలిలో రాజాజీ పాకిస్థాను ప్రచారసభలో జరిగిన ఒక ముఖ్య విషయాన్ని శ్రీ కె. పి. యజ్ఞేశ్వరశర్మ బయటపెడుతున్నాడు.

ఆసభలో పోలీసు పార్టుహ్యాండు రిపోర్టరు సాంబమూర్తిగారి ఉపన్యాసానికి నోట్సు తీసుకున్నాడు. రాజాజీ ఉపన్యసిస్తుండగా చేతులు కట్టుకుని కూర్చున్నాడు.

రాజాజీ ఉపన్యాసానికి నోట్సు అక్కరలేదని అతనికి అధికారుల ఆజ్ఞ అప్పుడే పుట్టిందా ?

# పిల్లులస్వర్గం పిట్ కెయిరన్ దీవి

'ఆదీవిలో ఒక్క పిల్లిని చంపిన అపరాధానికి మూడువందల ఎలకతోకల చివరల్ని అధికారుల అజమాయిషీకి అప్పగించాలి... పిల్లులకోసం ప్రత్యేకింపబడ్డ మరోదీవిలో మ్యావ్ అనే పిల్లికూత ఒక్కటే మనం వినవచ్చే శబ్దం.'

మే మాసపు ఆంధ్రభూమి సంచికలోని 'జపానీయులు : పిల్లులు' అనే వ్యాసంలో జపానీయులు తమ దీవుల్లో కొన్నిటిని పిల్లుల నివాసానికి ప్రత్యేకింపబడివుండడం ప్రస్తావితమైవుంది.

జపాన్ దీవులేకాక ప్రపంచంలో మరికొన్ని ఇతర దీవులుకూడా పిల్లులకు ప్రత్యేకించి వుంచడం ఇప్పుడు తెలియవస్తూవుంది.

పిల్లులకోసం ప్రత్యేకింపబడ్డ రెండు దీవులనుగురించి కలకత్తాలోని 'సండేస్టేట్స్‌మెన్' పత్రికలో ఈవెన్ కె పాటర్‌సన్ అనువారు ఒక చక్కని వ్యాసాన్ని వ్రాసివున్నారు. ఆవ్యాసంలోని విషయాలు తెలుసుకోతగినవిగా వున్నాయి.

ఆదీవుల్లో ఒకటి పిల్లులకు ప్రత్యేకింపబడిన స్వర్గధామమనీ, ఆ దీవిలో మ్యావ్ అనే పిల్లికూత ఒక్కటే మనం వినవచ్చే శబ్దమనీ పాటర్‌సన్ వ్రాస్తున్నాడు.

హిందూ మహాసముద్రంలో మారిటియస్ దీవులకు రెండువందలమైళ్ళ నైరృతిమూలలో చిన్న పగడపుదీవి ఒకటి వుంది. భూగోళశాస్త్రంలోకి ఆదీవిపేరు ఇంకా ఎక్కలేదు.

కాని, దాని విశేషమేమిటంటే ఆదీవి అంతా పిల్లులతో నిండారి వుండడం. అనేకమైన ఆకారాలు, అనేకమైన పరిమాణాలు, అనేకమైన వర్ణాలుకల పిల్లులు వేలకొలదిగా ఆదీవిలో నివశిస్తూవున్నాయి.

ఆదీవిలో మొక్కా, మోటికి ఏమీలేదు. పిల్లులు విస్తరించి వుండడంచేత ఆదీవిలో ఎక్కడకాని పక్షులువాలవు. అచ్చటి పిల్లులు నక్కలవలె నేలలో బొరియలు చేసుకుని నివశిస్తూ వుంటాయి.

ప్రపంచంలోని పిల్లుల వలసదీవి ఇది ఒక్కటే కాదు. దక్షిణ ఫసిఫిక్‌లో మరిఒకటివుంది. అక్కడి పిల్లులు నీటిలోమునిగి చేపల్ని వేటాడ్డానికికూడా సమర్థమైనవి.

ఈదీవి టహాటీకి ఒక రోజు ప్రయాణపు దూరంలోవుంది. దాని చరిత్ర ప్రారంభమై ఇప్పటికి నూరు సంవత్సరాలు ఐందని చెప్పవచ్చు.

దాదాపు నూరు సంవత్సరాల క్రితం ఆదీవి చెంత రెండు ఓడలు విచ్ఛిన్నమై మునిగిపోయాయి. ఆ ఓడలలో అప్పటికి చాలా ఎలకలు వుంటూవుండినవి. ఆ ఎలకలన్నీ మునిగిపోయిన ఓడలను వీడి నెమ్మదిగా ఈదుకుంటూ ఆదీవికి చేరుకున్నాయి.

ఆ దీవిమీద ఆ ఎలకలు తామరతంపరగా అభివృద్ధిపొందాయి. అచిరకాలంలోనే ఆదీవి ప్రజలకు ఎలకలపీడ భరింపరానిది ఐంది. ఎలకలు కనిపించిందల్లా తినివేయడం మొదలుపెట్టాయి. ఆ దీవి ప్రజలు పండించుకున్న పంటలన్నీ ఆ ఎలకలే తినివేస్తూ వచ్చాయి. ఇంట్లో వున్న వస్తువులను అన్నిటినీ తినివేయడమే కాకుండా ఎలకలు తమ దృష్టిని చంటిపిల్లలమీదకు కూడా మరలించాయి.

అప్పుడు ఆదీవివాసులు ఎలకల బాధ భరింపలేక ఆదీవిని వీడి స్థలాంతరానికి వలసపోయారు. అందులో ఆదీవి పూర్తిగా ఎలకల దీవి ఐంది.

తిమ్మిని చంపే మానవులు తమ్మిని చంపలేక స్థలాంతరానికి లేచిపోగా ఆమీద నిరభ్యంతరంగా ఎలకలు

ఆదీవిలో మరింత అభివృద్ధి నందేయి. పదియేళ్లు తిరిగి వచ్చేసరికి ఆ దీవిలోని ఎలకలు దుర్యోధనసంపత్తిగా ఎసరేగాయి. ఇక ఆ ఎలకల్ని జయించి మానవుడు ఆదీవిని తిరిగి స్వాధీనం చేసుకోలేడేమో అనిపించింది.

ఆదీవినుంచి ఎలకల్ని పూర్తిగా తోలివేయగల వానికి ఆదీవిని సర్వదుంబాలాగా ఇచ్చివేస్తామని అధికారులు ప్రకటించారు.

కాని ఎవరూ ఆపనికి పూనుకోడానికి సాహసించలేక పోయారు.

ఇట్లుండగా 1880 ప్రారంభంలో టాహిటికి ఒక ఫ్రెంచి జాతీయుడు వచ్చాడు. వాడు ఎలకల దీవినిగురించిన ప్రకటనవిన్నాడు. పిల్లులసేన సాయంతో ఎలకల్ని జయించి ఆదీవి తనది చేసుకోడానికి ఆఫ్రెంచిజాతీయుడు నిశ్చయించుకున్నాడు.

బ్రతికివున్న స్థితిలో తనకు అప్పగించే ఒక్కొక్క పిల్లికీ ఇంతింత పైకం ఇస్తాననే కరపత్రాలు అతడు టాహిటీలో విరివిగా పంచిపెట్టాడు. అందుతో ఒక నెలఅయ్యేసరికి ఐదువందల పిల్లులు కూడాయి. ఈ ఐదువందల పిల్లుల్ని అతడు సగమాకలితో మాడుస్తూ టాహిటినుంచి ఎలకలదీవికి ప్రయాణమై పోయాడు.

ఆదీవికిచేరి ఆదీవిమీదకు ఐదు వందల పిల్లుల్ని వదిలిపెట్టాడు. సగమాకలితో సతమతమవుతూవున్నవేమో ఆపిల్లులు వెంటనే ఎలకల వేటకు పూనుకున్నాయి. మూడు మాసాలు ఐదువందలపిల్లులు రాత్రింబగళ్లు వేటాడగా ఆదీవిమీది ఎలకలజనాభా కాస్త పలచబడి అక్కడ మానవుడు కాలూది కాపరంపెట్టడానికి ఆస్కారం కలిగింది.

దీవిని తనదిచేసుకుని ఫ్రెంచి జాతీయుడు అక్కడ నారపరిశ్రమ, కోళ్ళ పెంపకపు పరిశ్రమ పాదుకొల్పాడు.

కాని ఆ పరిశ్రమలు అభివృద్ధి పొందలేదు. ఏపిల్లులసేన అతనికి ఆ దీవిని సంపాదించి పెట్టిందో ఆ పిల్లులసేన ఆదీవిలో అతని కాపరానికి ఆస్కారంలేకుండా చేసింది.

మచ్చుకు ఒక్కటికూడా లేకుండా ఎలకలు నాశనమయ్యాయి కాని వానిని చంపిన పిల్లులే ఆ

# భార్యాభర్తలకు బుద్ధదేవుని హితవు

## ౧

తన భార్యపట్ల భర్త ప్రవర్తింపవలసిన విధానంలో ఐదు ప్రధాన సూత్రాలు వున్నాయి.

(1) భర్త భార్యను సంపూర్ణహృదయంతో గౌరవించాలి.

(2) ఆమె అభిప్రాయాలను చీదరించుకోకూడదు.

(3) ఆమెను తప్పించి కామపురుషార్థపు దృష్టితో ఇతర స్త్రీలను ప్రేమించకూడదు.

(4) ఆమెకు తృప్తి కలిగేరీతిగా అన్నము పెట్టి, వస్త్రాలు ఈయాలి.

(5) అర్హకాలాల్లో ఆమెకు భూషణాలు ఇస్తూవుండాలి.

## ౨

తనభర్తపట్ల భార్య అవలంబించవలసిన ప్రవర్తనవిధానంలో ఈ క్రింది ఐదు సూత్రాలున్నూ ముఖ్యము.

(1) భర్త ఇంటిలోకి రావడముతోటే గౌరవపూర్వకముగా ఆమె లేచి నిలుచుండి అతనికి స్వాగతంచేయాలి.

(2) భర్త ఇల్లువిడిచి బయటికి వెళ్ళినప్పుడు ఆమె వంట మొదలగు ఇంటి పనులలో పర్యాప్తవై వుండాలి.

(3) హృదయంలో మరొక పురుషునిపట్ల ప్రేమాభిమానాలు కలిగి వుండకూడదు. భర్త కోపగించి మాట్లాడితే భార్య మారుమాటాడకూడదు. తాను తిరిగి కోపగించకూడదు.

(4) భర్త ఆజ్ఞను శిరసావహించాలి. ఇంటివస్తువులేవీ భర్తకు తెలియకుండా దాచకూడదు.

(5) భర్త విశ్రాంతి తీసుకుంటూ పడుకుని నిద్రిస్తూవుండినపుడు ఇంటితలుపులు వేయకుండా ఆమె నిద్ర పోకూడదు.

దీవికి కొత్తపీడగా తయారయ్యాయి. తుదకు—వెనకటి ఎలకల బాధను మించింది ఇప్పటి పిల్లుల బాధ.

ఆదీవి నీళ్లు పిల్లులకు బాగా వంటపట్టాయి. అక్కడి శీతోష్ణస్థితి వాటికి బాగా పట్టింది

కాగా అవి చిగిరింతఐశ్వర్యంగా అభివృద్ధి పొందాయి. అచిర కాలంలోనే ఆదీవి అంతా పిల్లుల మయమైపోయింది—చిన్న పిల్లులు, పెద్దపిల్లులు, ఆడపిల్లులు, గండుపిల్లులు, ముసలిపిల్లులు, వివిధాకారాలపిల్లులు, పలురంగులపిల్లులు.

ఎలకలన్నీ ఐపోగా పిల్లులకు ఆహారవిషయంలో కరువు ఏర్పడింది. అప్పుడు ఆ పిల్లులు తమ దృష్టిని తమ్ము అక్కడికి తెచ్చిన ఫ్రెంచిజాతీయుని కోళ్లగూడిసె మీదకు బరిపాయి.

ఆకలిగొన్న ఆ పిల్లుల్ని ఆపడం దుస్తరమైంది కొన్ని వారాల్లో ఆ ఫ్రెంచిజాతీయుని కోళ్లన్నీ ఆ పిల్లుల పొట్టల్లోకి భుక్తమై పోయాయి

కోళ్లను అన్నిటినీ తినివేసిన తరువాత పిల్లులు ఒండొంటిని చంపుకుని తినడానికి ప్రారంభించాయి. ముసలి వాటిని, ముక్కి వాటిని, బక్క వాటిని—పసుచునీ, బలమైనవీ చంపుకుని తినివేస్తూ వచ్చాయి.

రాత్రిళ్లు ఆహారంకోసం పిల్లులు ఫ్రెంచిజాతీయుని ఇంట్లో ప్రవేశించి చేసే హంగామాకు హద్దు పద్దు లేకపోయింది.

ఫ్రెంచిజాతీయుడు వాటిని అదలించ ప్రయత్నిస్తే అవి ఎదురు తిరిగేవి. పిల్లులు తమ్ము ఎక్కడ చీల్చుకుని తినివేస్తాయో అనే భయంతో అతని సేవకులందరూ పారిపోయారు. ఒంటరిగా అక్కడ వుంటే పిల్లులచేతుల్లో తనకు మరణం తప్పదని నిశ్చయించుకుని ఆ ఫ్రెంచి జాతీయుడు ఆదీవిని పిల్లులకు వదిలిపెట్టి వెళ్ళిపోయాడు.

ఈసంగతి జరిగి ఇప్పటికి యాభై ఏళ్లు ఐంది. అప్పటినుంచి ఆదీవి పిల్లుల అగ్రహారంగానే వుండిపోయింది. ఆపిల్లుల్ని నాశనంచేయడానికి ఇప్పటివరకు ఎట్టి ప్రయత్నం కాని చేయబడలేదు.

ఇప్పట్లో ఆపిల్లులదీవిమీద కాలుపెట్టడానికి ఏమానవుడున్నూ సాహసించడంలేదు. ఆ పిల్లులు ఇప్పుడు మరింత ఘాతుకమృగాలయి వున్నాయి. మానవ మాంసంకోసం అవి బాగా తహతహ పడుతూన్నట్లుంది.

## ఆదర్శరాజ్యమునుగురించి గొంతెమకోర్కెలు

పూర్వకాలాన గ్రీసుదేశంలో ఏడుగురు మేధావులు వుండేవారు. పెరియాండరు అనేవాడు ఆ ఏడుగురికి ఒకసారి విందుచేసి 'ఆదర్శరాజ్య మెట్టిది?' అనే ప్రశ్న వేశాడు. ఆ ఏడుగురిలోలో ఒక్కొక్కరు ఇచ్చిన సమాధానాలు ఇవి:

*సోలన్ :-

ఏ రాజ్యంలోని క్షుద్రపౌరుడికి తగిలిన దెబ్బకూడా అందరికీ తగిలినట్లు భావింపబడుతుందో...

*బెయస్ :-

న్యాయసూత్రాన్ని తలదన్నేది ఎక్కడలేదో...

*థేల్సు:-

ఎక్కడ భాగ్యవంతులు మిక్కిలి భాగ్యవంతులుకారో, ఎక్కడ పేదవారు మిక్కిలి పేదవారుకారో...

*ఎనాకార్సిస్ :-

ఎక్కడ సుగుణం పొగడబడుతూ దుర్గుణం తెగడబడుతూ వుంటుందో...

*పిట్టాకస్ :-

ఎక్కడ గౌరవాలు, బిరుదులు చెడ్డవారికికాక మంచివారికి ఈయబడతాయో...

*క్లియోబులస్ :-

శిక్షకంటెకూడా నిందకు ప్రజలు ఎక్కువగా ఎక్కడ భయపడతారో...

*చైలో:-

ఎక్కడ నోరుగలవారికంటె న్యాయసూత్రాలకు ఎక్కువ అధికారముంటుందో, ఎక్కడ అవి లెస్సగా పాటింపబడతాయో...

ఏమంటే?...

ఆదీవి చెంతకు ఏదేనా ఓడ వస్తే పిల్లులు కోపముఖాలతో ఒడ్డున మూకలుకట్టి కాచుకుని వుంటాయి.

వాటికి ఇప్పుడు అక్కడ సుఖ జీవనంలేదు. ఆహారం సులభంగా దొరకడంలేదు.

చేపలు, పీతలు, తాంబేళ్లు ఇప్పుడు వాని ముఖ్యమైన ఆహారం.

ఈ ఆహారాన్ని సంపాదించడం కోసం అవి నీటిలో ఈదవలసి, మునగవలసి వస్తూవుంది. ఈ రెండు విద్యలు ఇప్పుడు అవి బాగా నేర్చుకున్నాయి.

ఈనేరోజుల్లో ఆడతాంబేళ్లు గట్టుకువచ్చి గ్రుడ్లుపెట్టేటప్పుడు ఏటేట ఈ పిల్లులు వానిని ఎన్నిటినో తమపొట్టనుపెట్టుకుంటాయి.

ఈదీవిసముద్రపుగట్టున చేపలకోసం శారలుతీరి వేచివుండే పిల్లుల్ని ఈదీవిచెంతగా ఓడలమీద పోయేవారు చూడగలుగుతారు.

గట్టుకువచ్చే ఎంత పెద్ద చేపనైనా, తాబేటినైనా ఆపిల్లులు సునాయాసంగా పట్టి తినివేస్తాయి.

ఈదీవిమీద ఆదిలో ఎలకల పీడ ఎసరేగడం మూలాన్ని ఇట్లా జరిగింది. ఈసంగతి తెలుసుకునిన్నీ దక్షిణ పసిఫిక్‌లోని ఒక దీవి ప్రజలు తమకుగల ఎలకలపీడ వదల్చుకోడానికి ఇటీవల పిల్లుల్ని దిగుమతి చేసుకున్నారు.

ఈదీవిపేరు పిట్ కెయిరన్. పిట్ కెయిరన్ దీవిలో ఈనాడు పిల్లులకు ప్రత్యేక ప్రాముఖ్యము వుంది. వాని పరిరక్షణకు ప్రత్యేకంగా న్యాయసూత్రాలు నిశ్చితమై వున్నాయి.

ఆ దీవిలో ఎవడైనా తెలిసికాని, తెలియకకాని పిల్లిని చంపితే అది ఒక అపరాధంగా భావింపబడుతోంది. ఆ అపరాధానికి ఆదీవివాసులకు ఒక వింత శిక్ష వుంది.

ఒక పిల్లిని చంపిన ప్రతి నేరస్థుడు మూడువందల ఎలకల్ని చంపి వాని తోకచివర్లు అధికారులకు అజమాయిషీకి పంపాలి. అజమాయిషీ పూర్తిఅయ్యేవరకు అతని అపరాధానికి నిష్కృతిలేదు.

ఈ శాసనం మూలకంగా పిట్ కెయిరన్ దీవి పిల్లులపాలిటి స్వర్గలోకమైవుంది. ప్రపంచంలో మరి ఎచ్చోటకాని మార్జాలాలకు అట్టి మహనీయస్వేచ్ఛ లేదనడం అతిశయోక్తి కాజాలదు.

# రంగస్థలపు రంగేళీలు

స్థానం నరసింహారావు మతాబాకాల్పు—
గండికోట జోగినాధం సమయజ్ఞత—
నవుడూర రాజ ప్రేక్షకుని ఒళ్లు తెలియని శివ—
నాటకగుత్తల అద్దె సాహేబు ద్యుమత్సేనవేషం—
యన్. కొండలరావు చాకచక్యం—

రచయిత:

## 'నాటక కళా స్నాతకుడు'

౧

నాటకాలు వున్నవి వున్నట్టుగానే ప్రదర్శితాలు కావటంలేదు' కవి వ్రాసిన నాటకానికి నటకులు వారి కవిత్వాన్నికూడా కొంత చేర్చి, అప్పుడప్పుడు ఆడుతూ వుంటారు. అది వారు రసపుష్టి కోసం చేస్తారో, లేక సమయస్ఫూర్తికోసం చేస్తారో, అదీకాక, ఒకరిమీద మరివొకరు విసురులు విసిరి చిత్తుచెద్దామనే అభిప్రాయంతో చేస్తారో తెలియదు.

ఇట్లా చేయడంవల్ల నాటకంలోని అసలు భావం తాత్కాలికంగా దెబ్బతిని, ఔచితి భంగమౌతూవుంటుంది. ఈ స్వంత కవిత్వాలు కొన్ని కొన్నిచోట్ల పరాభవాలుగా పరిమించాయి.

మచ్చుకు కొన్ని :

రాజమండ్రిలో 'చింతామణి' నాటకం. ప్రముఖనటులు పాల్గొనడంచేత ప్రేక్షకులు వేనకు వేలుగావచ్చారు. నాటకం మంచి రసపట్టులోవుంది. సుబ్బిసెట్టిపాత్ర శ్రీ గండికోట జోగినాధంగారు నిర్వహిస్తూవున్నారు. చింతామణి శ్రీ స్థానంవారు—

స్థానంవారికి చింతామణిలాగే, జోగినాధంగారికి సుబ్బిసెట్టి పాత్రను పోషించడంలో అద్వితీయ ప్రజ్ఞ.

ప్రధమ పరిచయపు పరిహాసాలలో జోగినాధంగారు కొంచెం హుషారుగా నటించారు.

పరిహాసపు సంభాషణలో చింతామణి అన్నది: 'సెట్టిగారు! మీరు బాగా పాడతారని మాచిత్ర చెప్పింది. ఏదీ ఒక్కటి విసరండి' చూద్దాం' అని.

సుబ్బిసెట్టి గక్కురుమన్నాడు చింతామణి చెణుకుకు. అయితే, జోగినాధం ఇలాటి ధక్కాముక్కాలు తిన్నవాడు. గొంతు సవరించుకుని, హార్మోనిస్టుకు హుషారిచ్చి అందుకున్నాడు.

'కన్నీటి కెరటాల వెన్నెలా...'అని స్వరంవేస్తూ, మధ్య మధ్య రాగింతీస్తూ శరవేగపు విద్యూరపు స్థాయిలో కాస్సేపు విసిరాడు.

అతని సమయస్ఫూర్తికి సంతోషించి స్థానం, రంగచలనం రసవంతంకాగా, ముక్కుమీద వేలువేసుకుని 'ఈపాట ఎక్కడ నేర్చుకున్నారండి, సెట్టిగారు!' అని ముదలకించాను.

'ఆ! స్థానంవోడి గామఫోను పేలు లేదూ!— అది యినుకుతున్నాను' అన్నాడు. హాలు హాలంతా ఫిరగబడి నవ్వింది—

౨

సుబ్బిసెట్టికి గంధంపూసి, అత్తరుపురాసి, పన్నీరు జల్లి, వీవన వేస్తూ 'మందారగంధమిదే, మోదముగ పూయుమునా ... మందారగంధమిదె ..' అని పాడుతూ, వయ్యారంగా అడుగులేస్తూ అద్భుతంగా అభినయిస్తూ స్థానంవారు ఆ ఘట్టంలో అపరచింతామణిలా కనిపిస్తున్నారు.

సుబ్బిసెట్టి వెర్రిగా, ఆనంద పారవశ్యంలో వెకిలిచేష్టలు చేస్తున్నాడు. సహజహాస్యధోరణిలో జోగినాథంగారు మంచిమంచి మాటలు విసురుతూ స్థానంవారి పాటకు తగిన ఆట ఆడుతున్నారు.

చరణం అయిపోయింది. అయిపోయిందనుకున్న పాట ఆఖరుకాలేదు. తిరిగి పాడిన చరణమే పునశ్చరణమైంది. పాడినపాట పాడటం కష్టంకాదుకాని, చేసిన అభినయాన్ని తిరిగి చేయడం కష్టమేకాక, ఎక్కసమై నటుడు దెబ్బతింటాడు.

సరిగ్గా ఇదే అవస్థలో పడ్డాడు జోగినాథం. అయితే కోమటిబిడ్డ అయిన సుబ్బిసెట్టి భూమికలో వుండటంవల్ల ఆయుక్తులు అతడికి తట్టివుండవచ్చు. వెంటనే కుర్చీలోంచి లేచి, చింతామణివెంట తానుకూడా అడుగులువేస్తూ, తాళంకొడుతూ, వెకిలిరాగంతీస్తూ, డాన్సు ప్రారంభించేసరికి, సరసం విరసమవడమేకాక, చింతామణి చకితురాలై చలనంలేకుండా నిలిచిపోవడం, రంగస్థలంమీద నటకుల మనోభావాలను గుర్తించి ఏమవుతుందో అని ఎదురుచూస్తూ ప్రేక్షలోకం కడుపుబ్బనవ్వడం ఒక్కసారి జరిగాయి.

జోగినాథాన్ని స్థానం ఎద్దేవాచేద్దామని ప్రయత్నించి విఫలుడయ్యాడు. వైశ్యుణ్ణే మాటల్లో వెల్లకిల త్రోయడానికి వేశ్యకూడా తరంగాకపోవడం చిత్రమే—

## కాజీపేట : బల్లార్షా రైలు బాట

8-4-1886 వరంగల్ బెజవాడ రైలు బాటపని ప్రారంభింపబడింది.

1-2-1924 కాజీపేట బల్లార్షా రైలు బాటపని ఆరంభింపబడింది. అచిరకాలంలోనే ఆబాట పెద్దపల్లి వరకు నిర్మితమైంది.

1-7-1924 కాజీపేట బల్లార్షా రైలు బాట రామగుండంవరకు పూర్తి చేయబడింది.

15-10-27 కాజీపేట బల్లార్షా రైలు బాట ఆసిఫాబాద్‌వరకు పూర్తి చేయబడింది.

15-11-28 కాజీపేట బల్లార్షా రైలు బాట పూర్తి చేయబడింది.

16-12-28 నిజాము ఆ బాటను తెరిచాడు.

ఈ బాటవల్ల నిజాములోని కరీమ్‌నగర్, ఆదిలాబాదు జిల్లాలు బాగా అభివృద్ధిలోకి వస్తూవుండడమే కాకుండా దక్షిణ హిందూదేశానికి ఉత్తర హిందూదేశానికి దగ్గరదారి ఏర్పడింది.

---

### 3

'ద్రౌపదీవస్త్రాపహరణం' నాటకం. నవుదూరుతోటలో నాటకశాల కిటకిటలాడిపోయింది. పేరుమోసిన నటకులు ఆయాపాత్రల అభినయిస్తున్నారు. నాటకం చాలవరకు చకచక నడిచిపోయింది. తుది అంకం అవుతోంది, ద్రౌపదకి వస్త్రభంగం జరగవలసిన ఘట్టం అది. దుశ్శాసనుడు చరచరా వచ్చాడు ద్రౌపదిదగ్గరకు. క్రూరంగా ఆమె కట్టుకున్న చీర గబగబ వలిచేశాడు. ద్రౌపది అవమానంతో క్రుంగిపోతూ విలపిస్తోంది.

హాలులో కూర్చున్న ప్రేక్షకుల్లోంచి గబగబా వచ్చేస్తున్నాడు ఒక క్షత్రియవీరుడు– పిక్కలమీదికి ఎగద్రోసిన పంచినికూడా సవరించుకోకుండా, చెపాటికర్రను పైకి ఎత్తి పట్టుకుని, కుడిమీసాన్ని ఎడంచేత్తో మెలిపెడుతూ 'ఇందాకణ్ణుంచి చూస్తున్నాను, యీడి అంద్రెబ్బ. ఆడదాని సీరలిప్పడం ట్రా, యెదవలంజకొడకా! సచ్చేవులే...' అని కేకవేస్తూ రంగస్థలందగ్గరకు వచ్చేశాడు. ప్రేక్షకుల్లో గల్లంతు ప్రారంభమైంది. ఎంతో కష్టంమీద ఆరాచ రైతుబిడ్డను పట్టుకుని, 'అది నిజంకాదని వుత్తనాటక'మని బోధపరచి, హాలు అవతలకు తీసుకువెళ్ళేసరికి తలప్రాణం తోకకు వచ్చింది.

రాజుగార్ని పంపించిన తర్వాత నాటకం ఆడదామని ధర్మరాజు పాత్రధారి నటకులకోసం నేపథ్యం అంతా కలయ వెతికాను, అందరూ కనపడ్డారు– తెరలవెనకాల, సైడుసీనుల నంటిపెట్టుకునీని. వున్న చీరకూడా విప్పేసుకుని, లాగుతో గ్రీనురూములో కూర్చుని బీడీకాలుస్తున్నాడు ద్రౌపది.

దుశ్శాసనుడు కిరీటం, కత్తి

మొదలైనవాటిని ఏంచేశాడో తెలియదుగాని, హాలుకు సమీపంలో వున్న మామిడితోటలో చెట్టుపై కూర్చుని దడ తగ్గించుకుంటున్నాడు—

ఈ నాడు ఈ రాజుకే ఇంత ఉద్రేకం వస్తే నిజంగా పంచపాండవులు కానాడు ఎంత ఆగ్రహం వచ్చి వుండాలో!

౪

అవి రామనాథశాస్త్రి, రామతిలకం—జంటగా నాటకాలు ఆడుతూవున్న దినాలు. సావిత్రి నాటకం వాళ్ళ అభిమాన ప్రదర్శనం కనుక, అందులో నాటి ప్రత్యేక పబ్లిసిటీతో జనం గుమిగూడి పోయారు, బెజవాడలో.

ప్రకటించిన నటులు రాకపోవడం, ఆ స్థానే, ఇంకొక నటకబృందం తయారుకావడం, ఆంధ్ర ప్రేక్షక లోకానికి బాగా అలవాటౌతున్న రోజులవి.

ద్యుమత్సేనుడు లోపించాడు. లోపించినదే తడవుగా, కిరాయి కలిపి వస్తుందని, ఆ పాత్రగల పోర్షనుఅంతా కత్తిరించివేశాడు శాస్త్రి. అయితే వివాహానికి అంగీకారం తెలుపుతూ అనవలసిన 'అందులకు నా కంగీకారమే...' అనే ఒక్కమాటను అనడానికి మాత్రము మనిషి కావలసి వచ్చాడు. అనుకున్నంతలో ఎవరూ లభించలేదు. రాత్రి 11 గంటలు దాటింది.

# మిరియాల చెట్టు

మిరియాల చెట్టు పన్నెండు అడుగుల ఎత్తుకు ఎదుగుతుంది. కాని ఆకులు తోలుమాదిరిగా మందంగా వుంటాయి. దాని కాయలు లేతగా వున్నప్పుడు ఆకుపచ్చగా వుంటాయి. అవి ఎర్రపడగా కోసి ఎండపెడతారు. బాగా ఎండేసరికి అవి నల్లగా మారుతాయి. కాళ్లతో తొక్కి—వాటి నుంచి కాడల తొలగించివేస్తారు.

---

గ్రీన్‌రూములో వున్నాడు ఒక సాయిబు. నాటకాలకు డ్రెస్సులు అద్దెకిస్తూ వుండడం అతని వృత్తి. అతణ్ణి ద్యుమత్సేనుడు వేషం వేసుకోనమని, 'అందులకు నాకంగీకారమే...' అనే ఒక్కమాట అనమని అడిగాడు శాస్త్రి. 'నేను యేసం యేసుక్కూకుంటే, డ్రస్సులు వరైనా కొట్టేత్తారు, బాబయ్యా' అన్నాడు సాయిబు. చెప్పినమాట విని వేషం వెయ్యకపోతే! సాయిబుకివ్వవలసిన పాతబాకీకూడా ఎగబెడతానని శాస్త్రి భయపెట్టాడు. గత్యంతరంలేక అంగీకరించాడు, సాయిబు.

స్టేజీమీద, కళ్లుమూసుకుని కుర్చీలో కూర్చోమన్నారు, సాయిబు ద్యుమత్సేనులవారిని. సైడులోంచైనా డ్రెస్సులు వున్నాయో లేదో చూచుకోవడానికి వీల్లేకుండావచ్చింది సాయిబుకు— కళ్లుమూసుకుని అంధద్యుమత్సేనుడుగా అభినయించవలసి వచ్చినందుకు. విధిలేక అతడు అలాగే కూర్చుని సణుగుతూనే వున్నాడు డ్రెస్సులను గురించి.

నాటకం జరుగుతూవుంది. అశ్వపతి అన్నాడు 'నా కుమార్తె సావిత్రిని సత్యవంతునికిచ్చి వివాహం చేస్తున్నాను, తమ కంగీకారమేనా' అని—ద్యుమత్సేనుని వైపు తిరిగి.

'అందులకు నా కంగీకారమే అని అను—అనరా సాయిబు...' అని శాస్త్రి సాయిబును నెమ్మదిగా గోకాడు.

వేషధారణలో అనుభవంలేని సాయిబు ఈ గోకుడుకు చట్టున కళ్లు తెరిచాడు. ప్రేక్షకసమూహం కనుచీకట్లో తల్లక్రిందులుగా కనపడింది సాయిబుకు.

రెండుకాళ్లూ కుర్చీపైకి పెట్టి 'ఏం అంగీకారమండీ— నా డ్రెస్సులు యేడేనా కొట్టేత్తాడంటూంటేను' అని బావురు మన్నాడు.

పొట్ట చెక్కలయేటట్టు నవ్వి పోయారు ప్రేక్షకులు. తెర తొందరగా వ్రాలిపోయిందిగాని, లేకపోతే శాస్త్రిచేత సాయిబు తిన్న తన్నులు ఆడియన్సుకు అవుపించేవే.

౫

చిత్రనళీయం నాటకం. రాజమండ్రిలో. నలుడుగా మద్దాలి శేషగిరిరావుగారు, పుష్కరుడుగా యన్. కొండలరావుగారు అభినయిస్తున్నారు.

జూదంసీను జరుగుతోంది. నలపుష్కరులమధ్య ద్యూతవివాదాన్ని నడిపించే దేవలుడు అనే బ్రాహ్మణుని పాత్రను ఏడిద కామేశ్వరరావుగారు నిర్వహిస్తూ, పుష్కరుని పక్షాన్ని గైకొని, జూదాన్ని నెగ్గించారు నలుడు కిరీటాన్ని అక్కడ మేజామీద పెట్టి శలవుతీసుకున్నాడు. పుష్కరుడు కిరీటాన్ని తీసుకుని రమ్మని, సింహాసనంమీద రాజమర్యాదలతో అలంకరిద్దామని చెప్పాడు దేవలుడితో. కామేశ్వరరావుగారు చేత్తో గాడ్ మౌంటన్ హాట్‌పట్టుకుని తిప్పుతూవున్నట్టు, కిరీటాన్ని ఎడంచేత్తో ఎత్తిపట్టుకుని ఊగిసలాడిస్తూ తెరలోకి నడుస్తున్నారు.

కొండలరావుగారిది చూచారు. రాజకిరీటానికి జరుగుతున్న అమర్యాదను కనిపెట్టారు.

అక్కడ ఔచిత్యాన్ని కాపాడడానికి, మాటలు లేకుండా కేవలం సంజ్ఞామాత్రంగానే, కిరీటాన్ని బల్లమీద పెట్టమన్నారు నమస్కరించమన్నారు, రెండు చేతులతోను దేవతా విగ్రహాన్ని పట్టుకొని వస్తున్నట్టుగా పట్టుకు రమ్మన్నారు

కామేశ్వరరావుగారు కొండలరావుగారు చెప్పినట్టు చేశారు.

రాజకిరీటంయొక్క గౌరవాన్ని కాపాడినందుకు, ఆమర్యాదలు తెలియని కొత్తనటుడు కామేశ్వరరావుగారి పాత్రను చక్కగా సమర్థించినందుకు కొండలరావుగారి చాకచక్యాన్ని, సమయస్ఫూర్తిని ఒక్కపెట్టున నుతించారు ప్రేక్షకులు

[రంగస్థలపు రంగేళీలగు ఇట్టి ఘటనలు పరశ్శతాలుగా వుంటాయి. ఎవరికి అనుభవములో వున్నమట్టుకు వారు వ్రాసి పంపిస్తే వానిని యథావకాశాన్ని ఆంధ్రభూమిలో ప్రచురిస్తూవుంటాము.

—సంపాదకుడు.]

---

## సుభాషితాలు

ముందు ఏదో వస్తుందనే ఆశతో మాత్రమే జీవించేవాడు తుదకు ఆకాధం గంతల్లనే చనిపోతాడు.

—*Italian Proverb*

ప్రతివాడూ తన జ్ఞాపకశక్తి తగ్గివుండడాన్ని చెప్తాడు కాని తాను తప్పటడుగు వేసివుండడాన్ని ఒప్పుకోడు.

—*Rochefoucauld*

తెలివైనవారు, తెలివిలేనివారుకూడా తప్పులు చేస్తారు. వారిలో తెలివిలేనివారు ఎవరో సులభంగానే చెప్పివేయవచ్చు. ఏమంటే తెలివిలేనివారు ఆ తప్పిదాల్నె తిరిగి తిరిగి చేస్తూవుంటారు.

—*Our Times*

ప్రపంచంలో సగంమంది తమవద్ద ఏదో చెప్పవలసింది వుండిన్నీ ఏమీ చెప్పలేనివారుగా వుంటారు. మిగతా సగంమంది ఏమీ చెప్పవలసినవారు కాకపోయినా ఏదోచెప్పేవారుగా వుంటారు.

—*G. Frost*

పెద్దవాళ్ల తప్పిదాలు బుద్ధిహీనులకు ఓదార్పు విషయాలు ఐ వుంటాయి.

—*Disraeli*

ఒక మనిషి తప్పుచేసివుండి అతడు దానిని ఒప్పుకోలేని స్థితిలోవుంటే అతనికి తప్పకుండా కోపం వేపెత్తుతుంది.

—*Haliburton*

ప్రపంచంలో కురూపివైన స్త్రీ లేనేలేదు. సుందరంగా వుండడం అంటే ఏమిటో తెలియని స్త్రీలు వున్నారు.

—*Marie Cleire*

అస్తమానూ అబద్ధం ఆడేవాడికి కలిగే శిక్ష ఏమిటంటే క్రమంగా అతగాడికి తన అబద్ధాలు తానే నమ్మేస్థితి ఏర్పడడం.

—*Elbert Hubbard*

యౌవనము అనేది ఒక అద్భుతదశ. ఆ దశ పిల్లల్ని పుట్టించడంతో వ్యర్థం చేయబడడం అజ్ఞాకర విషయం.

—*Bernard Shaw*

ఎవడు తలచింది వాడు ధైర్యంగా పైకి చెప్పివేయకపోతూవుంటే ఎవడు ఏమి చెబుతున్నాడో అనే ఆలోచన వుంచవలసిన అవసరం వుండదు.

—*Zeno*

చెడ్డ మనుష్యులు తమ తప్పిదాల్ని క్షమించుకుంటారు. మంచివాళ్లు తమ తప్పిదాల్ని వదిలివేస్తారు.

—*Ben Jonson*

మానవుని తెలివితక్కువ అనే గొలుసులో అజ్ఞానము, అహంభావము అనేవి రెండు గట్టి కొక్కీలు'.

—*A. Vors*

ఒక మనిషికట్టిన బట్టలు ఆ మనిషి సంగతిని ప్రాయకంగా లోకానికి చాటుతూ వుంటాయి.

—*Shakspeare*

మన నిట్టూర్పులతో దానిని మరింత దవ్వుగా జోపుతున్నాము.

—*W. S. Landor*

'ఉదాహరణ అనేదే మానవులు ఏమైనా నేర్చుకునే పాఠశాల. మరో పాఠశాలలో వారు ఏదిన్నీ నేర్చుకోరు.

—*Burke*

# ముగ్గురు ముగుదల మృతి

[ చి న్న క థ ]

...యౌవనము, మాతృత్వము అనే రెండు గోడలచాటునా మీ దౌర్భాగ్యజీవితాలను దాచుకుందామని ప్రయత్నిస్తున్నారు, ఇంతకంటె వెర్రి ఇంకేముంది ?...

క థ కు డు :

## ఏడిద కామేశ్వరరావు



కథకుడు.

ముగ్గురు స్త్రీలు రైల్వేలైను వెంబడి నడుస్తూ వెళుతున్నారు.

వాళ్లు ఏ జాతివాళ్లో, ఏ కులం వాళ్లో, ఆలా ఎక్కడికి వెడుతున్నారో మొదలైన విషయాలతో కథకు నిమిత్తం లేదు.

రైల్వేలైను కూడా ఎక్కడ పుట్టి ఎక్కడకు పోయిందో కూడా -కథకు అక్కర్లేదు.

వాడిచూపుల్లా భూనభోంతరాళంలోకి దూసుకుపోతున్నట్లుగా ఆ రైల్వేలైను, కనుచూపు మేరను కూడా దాటి ప్రాకిపోతూ వుంది-

ఆ ముగ్గురు స్త్రీలు అలా నడుస్తూనే వున్నారు.

ఒకామె బిచ్చకత్తె...

కట్టుకున్న గుడ్డలు పాత పూరికొంపమీది తాటాకుల్లా వేళ్లాడుతున్నై. వస్త్రంలేని శరీరభాగం మన్ను కొట్టుకునిపోయి వుంది. సంరక్షణలేని జుట్టు ముడిలోంచి వూడిపోయి గాలిలో ఎగురుతోంది. దెబ్బలుతిన్న చాకిరాళ్లలా పాదాలు మోటదేరివున్నాయి. మడవలు పగుళ్లతో గాళ్లుపడివున్నాయి.

ఒకామె పడుచుపిల్ల...

వయస్సు సుమారు యిరవై వుంటాయి. కళ్లల్లో తళతళలు మెరుస్తున్నాయి. మిసమిసలాడుతూ యౌవనం ప్రతి అంగంల్లోను తొణికిసలాడుతోంది. నడకలో నిర్లక్ష్యభావం అడుగులు వేస్తోంది. చేతులు వయ్యారంగా గాలిలో యీాదులాడుతున్నాయి.

మరొకామె పసిబిడ్డతల్లి...

వెన్ను కలిగిన జొన్నమొక్కలా భారం, హుందా ఆమెలో చిప్పిలుతున్నాయి. ఎడంచేతిలో వున్న సన్నని బిడ్డ ఎర్రటి కళ్లతో ఆమె ఆశాదృక్కుల్ని అప్పుడప్పుడుఅపాయంగా ఆకర్షిస్తోంది.

ఆ ముగ్గురు మగువలు ఆలా నడుస్తూనే వున్నారు.

ప్రకృతి, వాతావరణంలోని ధ్వనితప్పితే, వారి ముగ్గురినడుమ సంభాషణ ఏమీ నడవలేదు. నిశ్శబ్దంగా, నిదానంగా నడుస్తూనే వున్నారు.

ఇంతలో దూరాన, ఎక్కడో రైలు వస్తూవున్నచప్పుడు వారి కర్ణపుటాలపడ్డది. ఆవెనుక చిన్న మబ్బుతునకలా నల్లని పొగకూడా దృగ్గోచరమైంది.

కళ్లముందు ఎక్కడో దూరాన, రైలుబద్దెలు రెండు ఏకమైపోయి, భూమ్యాకాశాలు రెండూ కలిసిపోతూవున్న ప్రదేశంలో...

రైలు వేగంగానే వచ్చేస్తోన్నట్టు చప్పుడు వ్యక్తం చేస్తోంది.

ఆ ముగ్గురు స్త్రీలు అలా నడుస్తూనే వున్నారు——

"ఇక రెండునిమిషాల్లో రైలు ఇక్కడికి వచ్చేస్తుంది..." అన్నది బిచ్చకత్తె నిరాశగా ముందుకు చూస్తూ...

ఆమె మాటల్లో భయంకరమైన అపాయం సూచితమవడం వారిద్దరూ గ్రహించారు.

"ఏమిటి?...ఏమంటావ్?..." అని ఇద్దరూ ఆమెను ప్రశ్నించారు. భయంతో కరిగిపోయిన కంఠస్వరాలు వారి మనోభిప్రాయాల్ని స్పష్టీకరించలేకపోయాయి.

"నేను చెప్పేదేమిటి? మీకు మాత్రం తెలియదూ!" అంది బిచ్చకత్తె. వారికి సమాధానం చెప్పిందేకాని, ఆమె దృష్టిమాత్రం ముందున, రైలుబద్దెలు రెండు కలుసుకుని పోతూవున్న చోటనే, లగ్నమై వుంది.

• చూస్తూవున్నకొద్దీ ఒక నల్లని చుక్క, అంతకంతకు పెద్దదవుతూ వున్న చుక్క, భూమ్యాకాశాలను రెండూ పెకలించుకుని ముందుకు వురుకుతూన్నట్టు ఆమెకు అవుపించింది.

ఆతృతగా అంది ఆమె.

"ఆ వచ్చే రైలు మన కష్టాలను ఒక్కపెట్టున గట్టెక్కించి వేస్తుంది..."

. సమాధానాలు లేనివారి దైనికసమస్యలు, అదీ అంతమూ కనపడని జీవితపు పోరాటాలు, ఉదయాస్తమానాలవలె విసువు విరామమూలేని కడుపు ప్రశ్న—ఆనాటితో శేషం లేకుండా తేలిపోనున్నదని ఒక ఆశాలేశం ఆమె రెండు నేత్రాల్లోను తళుక్కుమంది. ఆ మెరుపుతో ఆమె పీక్కుపోయిన రెండు కళ్లు ద్రవించిపోయాయి.

యౌవనాంగి ఆమెవైపు చూచింది.

"నాకు చావాలని లేదు... ఇంకా నేను చిన్నదాన్ని. జీవిత మాధుర్యాన్ని ఇంకా చవిచూడకపోతే ఏం ప్రయోజనం...?" అన్నది. ఆమె బిచ్చకత్తె మాటల్లోని విరక్తిని అవగాహన చేసుకున్నది. కాని మృత్యువుయొక్క క్రీనీడలకు తన లేతకాయాన్ని...బలి చెయ్యడానికి ఆమెకు సాహసం చాలలేదు...

"సరే, నీకు యౌవనం వుంది. కాని వుండి ఏంప్రయోజనం? పురుషుడిచేతిలో ఒక ఆటవస్తువవు అయిపోవడానికి కాకపోతే? కామతృష్ణ తనివితీరా తీర్చుకుంటాడు. అవసరం తీరిపోడంతోటే వాడిపోయిన పూలదండను విసిరినట్టు, నిన్ను అవతల విసిరివేస్తాడు. ఎందుకొచ్చిన యౌవనం?..." అన్నది బిచ్చకత్తె, యౌవనాంగి కేసి నిర్లక్ష్యంగా చూస్తూ.

"ఇదిగో, చూడు. అతణ్ణి ఏమీ అనకు. నేను వినలేను. నన్నతడు గాఢంగా ప్రేమించాడు. కాని తల్లిదండ్రుల మాటకు ఎదురు చెప్పలేకపోయాడు. కాని..."

"అయితే, ప్రేమ అనేదానిలో నీకింకా నమ్మకమున్నదన్న మాట. ప్రేమ! ఎంత చక్కని మాట. ముద్దులుమూట కడుతోంది కదూ? నీవంటివాళ్లని చెరగొనడానికే యీ మాటను సృష్టించాడు పురుషుడు...

నీకు పొంగులువారే యౌవనం వుంది. అది పొంగులువారుతూ వున్నంతసేపు ఒకటి రెండు సంవత్సరాలు నీకు కొన్ని అణాలు సంపాదించి పెడుతుంది. శరీరాన్ని కనాకష్టంగా అమ్ముకున్నాక, పొంగులు చల్లారిపోతాయి. తరవాత...ఆ తరవాత..."

బిచ్చకత్తె గొంతులో గాద్గద్యం సుళ్లుతిరిగింది. కళ్లు రెండూ ఎర్రబడ్డాయి. పెదిమలు తడబడుతూ, వంకర్లు పోయాయి...పైకి ఎత్తిన చెయ్యి వణికిపోతోంది...

"రోగాలతో రొచ్చులతో... ముదిమి నిన్ను ఆవహిస్తుంది. అప్పుడు నువ్వు ఎవరికొకావాలి? సంపాదన మాట అటుంచినా, బిచ్చమైనా పెట్టరు." అన్నది ఆవేశంతో.

"కాని యౌవనంవున్నంతసేపూ బ్రతికివుండడమే జీవితానికి సార్థకం. అటువంటి జీవితానందం..."

చప్పరించింది. యౌవనాంగి. ఆశతోకూడిన ఆనందం ఆమె ము

ఖంలో చిందులు త్రొక్కింది. బిచ్చకత్తె మాటలను ఖండిద్దామని ఆ యౌవనాంగి ప్రయత్నించింది. కాని, ఆమె మాటల్లోని వేడికి ఝుడిసి వూరుకుంది...

బిచ్చకత్తె మళ్లీ ముదలకించింది. కాని యౌవనాంగి నిరుత్తర కావడంతో పక్కకు చూచింది....

“నువ్వేమంటావు? నీకూ భయం వేసేస్తోంది కాబోలు, చావంటే...”

అంది బిడ్డతల్లిని సిలబెట్టి—

“అబ్బ, ఆమాటనకు...”

చకితురాలైంది ఆమె. అప్రయత్నంగా తన గర్భఫలాన్ని రెండు చేతులతోటీ దగ్గిరకు లాక్కుని వక్షానికి అదుముకుంది. బిత్తరపోయిన ఆమె కళ్లల్లోంచి జలబిందువులు జలజలరాలాయి.

“...నేను చచ్చిపోగలనా? నా బంగారపు కొండకోసమైనా బ్రతికి వుండొద్దూ?...”

“బంగారం! మాంసపు ముద్దలే మనకి బంగారాలు!!

నీ దౌర్భాగ్య జీవితానికి అది ఒక మచ్చుతునక. సంఘంలోని అన్యాయాలకు ఘోరాలకు బలి అయిపోయి, చక్కని చిహ్నంగా నువ్వు ఏర్పడ్డావా? యిక నీకు మాత్రం మచ్చుముక్క లెందుకు?

“ఔను, నాకూ తెలుసును. అయినా ఇది నాది; నా బిడ్డ... నా రక్తంలోని రక్తం...”

“రక్తం...ఎక్కడుంది? తుపానులా వర్షం కురుస్తూవుంటే సూదుల్లా చలి చిల్లులు పొడుస్తూవుంటే, ఆనాటిరాత్రి నిన్ను బయటకు గెంటివేస్తూ మీ నాన్నా, అమ్మా ఇది ఆలోచించారా? రక్త సంబంధం...”

“ఇదిగో...చావంటే నాకేం భయం లేదు, నేను దానికి తగిన

దాన్ని కనక. పైగా దానివల్ల నా కష్టాలు పూర్తిగా తీరిపోతాయి కూడాను... కాని, వీని గతేంకాను? నువ్వు కొంచెం దగ్గరకు చేరదీసి ఆదరిస్తావా? నేను చచ్చిపోయిన తర్వాత...?"

"నీతోపాటు వాణ్ణికూడా చచ్చిపోనీ. ఎందుకూ ఉపయోగం లేని ఒక ముష్టిజీవం తగ్గినా తగ్గడమే యీ ప్రపంచంలో, వాణ్ణి బ్రతికించి మాత్రం ప్రయోజనమేమిటి? వాడికి ఏమంత మంచి భవిష్యత్తును ఏర్పరచగలవు నువ్వు?"

బిడ్డతల్లి గుండెల్లో గుబగుబలు బయలుదేరినై. బిడ్డను మనసారా గుండెలకు హత్తుకుంది. తనివితీరా వాని అమాయకపు నేత్రాల్లోకి చూచి బుగ్గలు ముద్దెట్టుకుంది. ఆ పాదమస్తకం వాణ్ణి మృదువుగా నిమిరివేసింది.

ముసలిదానికి మరి సమాధానం చెప్పటం మానివేసింది.

బిచ్చకత్తె బింకంగా అడుగులు వేస్తోంది. ఆమె వాలకం ఆమె దృఢనిశ్చయాన్ని తెలియజేస్తోంది.

దూరాన నల్లని మచ్చమాత్రంగావున్న చుక్క అంతకంతకు పెద్దదైపోతూ ఉరకలు వేసుకుంటూ ముందుకు వస్తోంది.

"సరె... నేనుమాత్రం చనిపోవడానికే నిశ్చయం చేసేసుకున్నాను. లేకపోతే, నాకేముంది, యీ ప్రపంచంలో..."

అంది బిచ్చకత్తె కాస్సేపు వూరుకుని.

"నీకు మతిపోయింది..." అన్నారు—యౌవనాంగి, బిడ్డతల్లి—ఒక్కమారుగా నిరుత్సాహాన్ని సూచిస్తూ.

"హహ్హహ్హ" అని ఓ పెద్ద వెర్రినవ్వు నవ్వింది బిచ్చకత్తె.

"నాకు మతిపోయిందని అనుకుంటున్నారు కాదూ మీరు? ఇదిగో, మిమ్మల్ని గురించి నేనేమనుకుంటున్నానో చెబుతాను వినండి. మీరు పిరికిపందలు. తెగింపనేది మీలో ఏ కోశాన్నీ లేదు. యౌవనము, మాతృత్వము అనే రెండుగోడలచాటునా మీ దౌర్భాగ్య జీవితాలను దాచుకుందామని ప్రయత్నిస్తున్నారు. ఇంతకంటే వెర్రి ఇంకేముంది? మతిలేనివాళ్లు మీరు కాని, నేను కాదు.. ...ఇక శలవు..."

అంటూ చకచక ముందుకు నడవనారంభించింది బిచ్చకత్తె.

"ఇదిగో, నువ్వు లేకపోతే, మేము బ్రతకలేము. నువ్వు చనిపోతే, మేముకూడా చచ్చిపోవలసిందే..."

అన్నారు ఇద్దరూ వణికిపోతూ, అంటూ ఆమెను ఆపడానికని సర్వశక్తులా ప్రయత్నించారు.

రైలు ఇంక ఎంతోదూరంలో లేదు. కొన్ని గజాలదూరంలోకి వచ్చేసింది. అంతజోరులోను ఇంజను కెవ్వున యీలవేసింది. ఇంజను డ్రైవరు చట్టున బ్రేకుల గొలుసు లాగాడు. లాగాడు కాని అప్పటి కప్పుడే అంతా మించిపోయింది.

పెద్ద చప్పుడు చేసుకుంటూ కుదుపుకుంటూ ఇంజను కొంతదూరంలో ఆగింది. ఇంజనులోనివాళ్లు చక్రాల నంటిపెట్టుకునివున్న రక్తాన్ని, మాంసాన్ని, ఎముకల్ని ఊడలాగడానికి క్రిందకు దిగారు.

అపుడే బిలబిల వచ్చేశారు రైలులోవున్న జనసమూహం ఎంతో ఆతృతగా...

ఒకడు అన్నాడు:

"ఆ! ఎవరో ఒక బిచ్చకత్తె. పోనిద్దూ"

మరొక డన్నాడు.

"అరే! ఒక యౌవనాంగి. అందంగాకూడా వున్నదే..."

ఇంకొక అత డన్నాడు:

"రామ, రామ. ఆమె ఒక బిడ్డతల్లి... పాపం..."

"ఒక ఆడమనిషి చచ్చిపోయింది..." అన్నా డొక ప్రేక్షకుడు, "ఏమిటది?" అని అడుగుతూ, చూడటానికి అప్పుడే వచ్చిన మరొకనితో.

ఆయా మాటలను వింటూనే, ఆ సంఘటనలోని బాహ్యవిషయాలనే కాక, అంతర్విషయాలనుకూడా నిశితదృష్టితో పరీక్షించిన ఒక వేదాంతి అన్నాడు, జనసమూహంలో నుంచుని:

"కాదు. ఒక స్త్రీ కాదు. ముగ్గురు స్త్రీలు."

# వేసవి పానీయాలు

క. గొప్పైన నిమ్మపండ్లును
గప్పురమును సొంటిపొడియు గతివేఁపాకున్
ఉప్పును నేలకు లింగువు
నొప్పుగ నీ చల్లరుచికి నొనగూర్పఁదగున్.

అని 'నీరు మజ్జిగ'ను గురించి ఒక చాటుధార వుంది.

ఈ పద్యం చదువుతూవుంటే వేసవికాలంలో మధ్యాహ్నమప్పుడు-గ్రీష్మతాపం భరింపరానిదై వున్నప్పుడు-ఇట్టి నీరుమజ్జిగ దాహం ఎంతో వరణీయమై వుంటుంది కదా అనే ప్రలోభం ప్రతివాడి మనస్సులోనూ కలుగుతుంది.

మంచుగడ్డ వేసిన సోడా, నిమ్మనీరు, తరవాణి తేట, తేట మజ్జిగ, కూజాలోని నీళ్లు మున్నగునవి వేసవికాలంలో వరణీయమైన పానీయాలు.

ఈ పానీయాలు సామాన్యమైనవి. వైద్యశాస్త్ర ప్రోక్తములయిన రెండు పానీయాలు వేసవిలో ముఖ్యముగా ఉపయోగింపదగి వున్నాయి.

ఆ పానీయాలను ఎల్లరు తయారుచేసుకో డానికి వీలుగా వుండేటట్లు వాని యోగాలు ఇక్కడ వ్రాస్తున్నాను.

౧

## అనాసఫల పానీయము

దీనినే యునాని వైద్యులు అనాసపండ్ల షర్బతు అంటారు.

బాగుగా పక్వమైన ఐదు అనాసపళ్ళను తేవాలి. తొక్క పెచ్చులు చెక్కివేయాలి. జిలక ఉప్పుతో కాయలను బాగా రుద్ది కడిగాలి. పొడిగుడ్డతో నీరు అద్దివేయాలి. కాయను పొడుగుగా నాలుగు ముక్కలు చేయాలి. పనసకాయలో వలె వుండే నడిమిబొడ్డును కోసివేయాలి. ఇట్లు శుభ్రముచేసిన అనాసపండు ముక్కలను కఱ్ఱరోటిలో కఱ్ఱబండతో దంచి రసము తీయాలి. అరసాన్ని పలచటి మంచి గుడ్డలో వడియ కట్టాలి.

రెండు సేర్ల రసానికి ఒక వీశెడు పంచదార వంతున చేర్చి సన్నటి సెగమీద కాచాలి. రెండు మూడు పొంగులు

రానిచ్చి ఇష్టమైన సుగంధద్రవ్యాలు చేర్చుకోవచ్చును.

సాధారణముగా పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, ఏలకులపొడి చేరుస్తారు. కొద్దిగా గొజ్జగినీరు చేర్చడంకూడా వుంది.

సుగంధద్రవ్యాలు చేర్చాక పానకాన్ని మళ్ళీ ఒక పొంగు రానీయడం మంచిది. పిమ్మట దీనిని దింపుకుని సీసాలకు ఎత్తుకుని భద్రపరుచుకుని వుంచుకుని వేసవికాలమునందంతా రోజూ ఉపయోగిస్తూ వుంటే చాలా ఉపకారకంగా వుంటుంది,

వేసవిలో భోజనానంతరం మధ్యాహ్నమప్పుడు పూటకు ఒక ఔన్సుకు మించకుండా సేవిస్తూవుంటే తాపశాంతికరంగా వుంటుంది.

ఈ పానీయం త్రిదోషహరమైనది; శీతవీర్యకరమైనది.

చలువచేస్తుంది. పైత్యాన్ని పోగొడుతుంది. అరుచిని పోకొడుతుంది.

దాహోపశమనం చేస్తుంది. మేహరోగులకు చాలా ఉపకారకంగా వుంటుంది. క్షయరోగులకు హితకరమై వారి జీర్ణకోశానికి బలాన్నిఇచ్చి ఉష్ణతాపాన్ని నివారించి శోషహరంగా వుంటుంది.

వేసవిలో కలిగే నీరసాన్ని తగ్గించి పుష్టిని ఇచ్చే పానీయాల్లో దీని కిదేసాటి.

## ౨
## శారిబాదిపానకము

వట్టివేళ్లు, మంచిగంధపు పొట్టు, ద్రాక్షపళ్లు, ఖర్జూరపుకాయలు, యష్టిమధుకము ఒకొక్కొక్క భాగము—సుగంధిపాలవేళ్ళపొట్టు ఎనిమిది భాగాలు గ్రహించి పదహారు భాగాల నీళ్ళలో పోసి నాలుగోవంతు ఇగిరేటట్టు కషాయంకాచి వడబోసి ఉంచుకోవలెను.

ఇష్టమైతేను, అవసరమైతేను ఈ కషాయంలో కొద్దిగా ఏలకపొడి చేర్చుకోవచ్చు.

ఈ కషాయంలో ఒకభాగం పిల్లితేగల నిజరసంపోసి కలసినంత పంచదారవేసి సన్నటిమంటమీద వండి తీగపాకం వచ్చాక దింపుకొని చల్లార్చి సీసాలకు ఎక్కించుకుని వేసవిలో ఉపయోగిస్తే చాలా గుణకారిగా వుంటుంది.

పెద్దవాళ్లు రోజుకు రెండు ఔన్సులకంటె ఎక్కువ ఉపయోగించకూడదు. పిల్లలు అరఔన్సుకంటె ఎక్కువ పుచ్చుకోకూడదు. ఈ పానకాన్ని మూడురెట్ల నీళ్లలో కలిపి పుచ్చుకోవడం మంచిది.

ఎండలో తిరిగివచ్చిన వెంటనే దీనిని పుచ్చుకోవడం చాలా ఆప్యాయంగా వుంటుంది. బాగా వేడిచేసినప్పుడు, పైత్యవికారం కలిగినప్పుడు దీని సేవన ఉపకారకంగా వుంటుంది.

గ్రీష్మకాలంలో పుచ్చుకోతగ్గ శాస్త్రప్రోక్తపానీయాల్లో ఇది శ్రేష్టమైనది.

ఈ పానీయంలో ప్రధాన ద్రవ్యం సుగంధిపాల. దీనినే సంస్కృతంలో శారిబ అంటారు. శారిబ మొదలగు ద్రవ్యాలతో చేయబడినది కాబట్టి ఈ పానకానికి శారిబాది పానకమని పేరు.

ఓషధులలో శారిబ రక్తశుద్ధికి పేరు మోసినది వేసవిలో సాధారణంగా కురుపులు వేస్తాయి. రక్తం శుద్ధంగా వుంచుకుంటే కురుపుల బాధ వుండదు. కాబట్టి వేసవిలో ఈ పానీయం సేవించడం చాలా మంచిది.

ఈ పానీయం బాగా రుచిగా వుంటుంది. రుచిగా వుందికదా అని ఎక్కువగా సేవించకూడదు. మోతాదు తప్పించి సేవిస్తే తప్పక చెరుపు చేస్తుంది.

# గులాబి గొడవ

[ఆత్మ కథనము]

"ఆమె నాదళాల నన్నిటిని తినేసి నాచెట్టి దేహాన్ని ఓ మూరు తేరిపారచూచి దూరంగా గిరవాటు వేసింది — నన్ను ఎంతో అవమానపరుస్తూ."

రచయిత :

## జబ్బల్‌పూర్ మోదక్

వసంతం నవనవోన్మేషములైన వన్నెచిన్నెలు తొడుగుతోంది ప్రకృతిలక్ష్మికి బాలారుణ కిరణాల మందార ఛాయలు బాహ్యాన్ని అలుముకుపోతూవున్న ఆ సుముహూర్తపు ఘడియల్లో నేను జన్మించాను.

నేను కళ్లు తెరిచాను. చీకటి అనే రాక్షసుణ్ణి చెండాడి, ప్రపంచానికి వెలుగుబిక్ష పెట్టి రక్తారుణ కిరణాలతో దేదీప్యమానంగా వెలుగుతూన్న భాస్కర బింబాన్ని కన్నుల పండువుగా చూచాను.

సభ్యతా ప్రపంచంలో తిరుగాడడానికి అనువైన నవ్య సభ్యతను బోధించడానికి వచ్చాడు రాజవార్తావహుడు. నీపేరేమిటన్నాను అతనితో. నాపేరా! గ్రీకులు జెఫ్ఫీర్ అంటారు. పెరిషియన్లు నసీమ్ అంటారు. ఆర్యులు వాయువు అంటారు-అన్నాడు నవ్వుతూ.

రాజ సందర్శనానంతరం దర్జాగా ఒక సంవత్సరం జరిగిపోయింది.

రెండో జన్మదినంవచ్చింది. సూర్యుడు గ్రహణంలో సంపూర్ణంగా ఆవరించుకొని పోయిన మూలాన నేను చిమ్మ చీకటిలో ఆ రెండో ఏడంతా గడపవలసి వచ్చినందుకు నాలో నాకే అమితమైనఆశ్చర్యం వేసింది.

అప్పుడప్పుడు కోమలాంగులైన దేవతాకన్యలు వస్తూవుండేవారు తళతళలాడే దీపాలుపట్టుకుని, నన్ను చూడటానికి. ఈ వచ్చి పోతూవుండడం వాళ్ళకు మామూలని మా తండ్రి చెప్పగా, కాబోలు అనుకున్నాను.

వాళ్లువచ్చి నన్ను తేరిపారి చూచి, నాసమీపంలో నుంచుని వెళ్ళిపోయేటప్పుడు అక్కడ కొన్ని అమృతబిందువులు ఒలికేవి, వాటిని నేను ఎంతో ఆనందంతో ఆరగించేదాన్ని. వాటిని పెరిగించే పురుగులని పిలవడం అన్యాయం గాదూ!

ఇల్లా ఆరుమాసములు జరిగాయి. ఇంతలో ఒకనాడు ఝుమ్మని పాడుతూ వైణికుడొకడు వచ్చాడు నాదగ్గరకు. "ఇంగ్లీషు వాళ్లు నన్ను నైటింగేల్ అంటారు. పర్షియన్లు బుల్‌బుల్ అంటారు. గ్రీకులు అట్టిక్ వార్బ్లర్ అంటారు." అంటూ చెప్పాడు. వెంటనే నిద్రతో బరువుగావున్న నాకళ్లు తెరిచాను. ఇంతట్లోకి నా కతడు కనపళ్ళేదు. కల కాబోలు ననుకున్నాను, కాని వైణికుని సంగీతం కర్ణపేయంగా వినబడుతూనే వుంది. కళ్లు బాగా విప్పిచూచా. కాని నాకతడు కనిపించలేదు.

ఇంతలోకి నేను వున్న గదితలుపులు మూసుకుపోయాయి. తిరిగి నేను గాఢనిద్రలో పడిపోయాను.

నిద్రపోయిందే తడవుగా మాధుర్యమైన కల ఒకటి వచ్చింది ఆ కలలో నేను విహారంచేస్తూవుంటే ఒక మోటచెయ్యి నన్ను మేల్కొల్పింది. కళ్లువిప్పిచూచేసరికి నా ఎదట ఒక పెద్ద మానవాకారం నాకేసి చూస్తూ నిలబడివుంది.

"అతడు తోటమాలి. అతనికి విధేయుతగా తలవంచు" అని హెచ్చరించాడు నా తండ్రి.

నా కమ్మని కల పాడైపోయి

నందుకు నాకెంతో కష్టంగావున్నా నే నతనికి వంగి నమస్కారం చేయక తప్పిందిగాదు. చదువు సంధ్యలతో సంస్కారంలేని మావంటి వాళ్ళకు పుట్టుకతోటి వచ్చేబుద్ధి వినయమేగా !

అతడు నాతలమీద మెల్లిగా నిమిరాడు; దీవించాడు ! నా అందాన్ని చూచి మురిసిపోతూ వెళ్ళిపోయాడు.

ఇప్పుడు నాకు రెండేళ్లు నిండాయి. నవనవలాడుతూవుండే యౌవనప్రాయులవలె నాలో అనేక కోరికలు రేకెత్తడం మొదలు పెట్టాయి. ఇంకా మెప్పులు పొగడ్తలు సంపాదించాలనే ఆశ నాకు ప్రబలము కాసాగింది. కాని, నా సౌందర్యాన్ని కనులారా చూచుకుని ఆనందించడానికి నేను నోచుకోలేదనే విచారం నన్ను బాధించేది. మోటువాడైనా తోటమాలిని నిలబెట్టి, ఆనందింపజేసిన నా సౌందర్యాన్ని నేను తనివితీరా చూచుకోలేక పోయాను.

కాని, నా ఆనందాన్ని–కోరికను నెరవేర్చుకోడానికి ఎన్నో రోజులు పట్టలేదు. ఒకనాడు ఒక యువకుడు వచ్చాడు. అతనికళ్లు అంతా మూతలుపడుతూ వింత సోయగాన్ని కూరుస్తున్నాయి అతడికి. వచ్చి, నా సమీపాన్ని నిలబడకుండా వెళ్ళిపోతున్నాడు. నాకు చాలా కష్టమైంది అతడు నన్ను మెచ్చుకోకండా వెళ్ళిపోతూవున్నందుకు. కాని ఇంతలో అతడు నిలబడ్డాడు. నిలబడి సంతోషాతిరేకంతో అన్నాడు: "అబ్బ! ఎంత అందంగా వున్నావు నీకు సరియైన స్థానం..." నాకు అతని మాటల్లో భావం సరిగా బోధపడ్డది గాదు. అతని వేళ్లు ఒక మాంత్రికుని చేతివ్రేళ్ళలా వుండడాన్నిబట్టి, అతనికళ్ళు స్వప్నావస్థలోవున్నవాని కళ్ళలా వుండడాన్నిబట్టి అతడు ఊహాగానాల్లో విహరించే విచిత్రమైన 'కవుల' జాతిలో వాడని అనుకున్నాను.

ఇంతలో మరొకడొచ్చాడు. అతడు గబగబ నా ఆకారాన్ని చిత్రించ నారంభించాడు. "బలే బాగావుంది. వుంటే ఇలా వుండాలి..." అని అనుకుంటూ ఆనందపడ్డాడు. నా చిత్రాన్నిచూచి నాకు చాలా సంతోషమైంది. నాకు ఎంతో సంతృప్తికూడా కలిగింది. మూడోవేడులోని మిగతా ఐదునెల్లు యీలాటి ఆగంతకులతోటి వాళ్ళపొగడ్తలతోటి గడిచిపోయాయి.

అది మూడో సంవత్సరంలో ఆఖరునెల. ఆఖరునెలలోని ఆఖరు వారం, ఆఖరు వారంలోని ఆఖరు రోజు. నాడు ఒక యువకుడు చరచర వచ్చేశాడు నాదగ్గరకు. అతడు ఏదో వెతుక్కుంటూ నాచుట్టుప్రక్కల చూడ నారంభించాడు.

అతడు నుంచున్నప్పటి నుంచి నాగుండెల్లో ఏదో అవ్యక్తమైన భయం బయలుదేరింది.

ఇంతలోకే అతడు ఇనుప ముక్కలాంటి అతని వేళ్ళతో నన్ను పట్టుకుని నాతండ్రిచేతుల్లోంచి బలవంతంగా లాగేశాడు. నన్నతడు తీసుకుపోతూవుంటే, నాతండ్రి కళ్ల వెంట ధారగా కారుతూవున్న నీటిబిందువులను చూస్తే నా కడుపు చెరువైపోయింది.

'ప్రేమపక్షులు' అని పిలవబడే వారిలో చేరిన యితడు నన్ను తన జేబులో పెట్టుకుని, పెద్ద ఉద్యానవనంతో నిండివున్న ఒక భవనం దగ్గరకు తీసుకువచ్చాడు. ప్రహరీగోడదగ్గరకు వచ్చి గభేలున దూకాడు తాడుపట్టుకుని. జేబులో వున్న నాకు పెద్ద కుదుపు తగిలింది. దానితో అతడు గోడదూకి వుంటాడని నేను నిశ్చయం చేసుకున్నాను.

ఖైదులావున్న ఆ జేబులోంచి నన్ను బైటకుతీసి ఎదురుగావున్న ఒక రంభలాంటి సుందరాంగి చేతులో పెట్టాడు. ఆమె ముసిముసి నవ్వులు నవ్వుతూ నన్ను అందిపుచ్చుకుని బులబులాగ్గా అల్లబడి వున్న గడ్డిలో కుక్కింది. ఆగడ్డి ఆకుపచ్చగా కాక, నల్లగా వుండడంచూస్తే నాకెంతో ఆశ్చర్యమైంది.

వాళ్ళిద్దరికి మధ్య కొంత సంభాషణ నడిచింది. అది వింటే నాకెంతో సిగ్గయింది. దాన్నంతా చెప్పడానికి వీల్లేదు కూడాను.

అయితే, ఒక్కమాట మాత్రం చెబితే చాలుననుకుంటా.

[మిగతా ౨౮౫–వ పేజీలో.

# మణిమాల

## వెంకటరామశాస్త్రి

సాహిత్యం సంగీతాలను సమ్మేళన చేసి సర్వేశ్వరసంకీర్తనతో తనువు చాలించిన త్యాగరాజు గారికి సమకాలికుడు ఈ వెంకట్రామశాస్త్రి గారు.

ఈయన జన్మస్థానం తంజావూరు జిల్లాలోని మేలత్తూరు గ్రామం. ఇంటి పేరుకూడా మేలత్తూరువారే.

ఈయనకు బాల్యంలోనే భరతశాస్త్రం అంటే బాగా అభిమానం అంకురించింది.

తన తరంలో, అప్పటికప్పుడే; దిగజారిపోతున్న భరతశాస్త్రాన్ని పునరుద్ధరించటానికి పూనుకున్నాడు.

ఆ ఉద్దేశంతో చక్కని ఆంధ్రంలో ఆయన అనేకనాటకాలు రచించాడు. రచించడమే కాక, స్వయంగా నిపుణులయిన నటులను ఏరికూర్చుకుని చక్కని శిక్షణ ఇచ్చి, చోళదేశంలో ప్రదర్శనాలిస్తూండేవాడు.

తన నాటకాలకు, తరతరాలనుంచీ పూజ్యాలుగా పరిగణింపబడుతూన్న పురాణవిషయాలనే ఇతివృత్తాలుగా తీసుకున్నాడు. ఆయన నాటకాల్లో ప్రత్యేకత ఏమిటంటే-నవరసస్ఫూర్తి. తొమ్మిదిరసాలూ క్రమానుగతికంగా, సందర్భానుసారంగా ఆవిష్కృత మౌతూంటాయి.

ఏకపాత్రాభినయం ప్రధానమైన భరతనాట్యంలోని భంగిమాలు ఎంత భావస్ఫోరకాలైనప్పటికీ, అనభిజ్ఞ సామాన్యప్రేక్షకులు ఆ సంకేతాలు అర్థం చేసుకుని ఆ భావాలు గ్రహించటం చాలా కష్టం.

ఆ కష్టం నివారించటానికి శాస్త్రిగారు ప్రత్యేకం పద్యాలూ, పాటలూ, ద్విపదలూ, దరువులూ రచించి, నటుడు అభినయం చేసేటప్పుడు నటనతో వీటిని మేళవించి పాడునట్లు ఏర్పాటు చేశారు. అందుమూలంగా అభినయంలోని ఆయా భంగిమాల భావరసాదులు ప్రేక్షకులకు బాగా బోధపడటానికి సదవకాశం సమకూరింది.

ఆయన రాసిన పద్యాలూ, ద్విపదలూ, దరువులూ నిర్దుష్టభావాలతో, చక్కని ధారాశుద్ధికలిగి భావస్ఫోరకాలై, లయానుగుణాలై అనన్యసామాన్య ప్రతిభను ప్రదర్శిస్తున్నాయి.

జంట, ఆహిరి ఇత్యాది క్లిష్టసంచారంకల రాగాలకు అనుగుణంగా ఆయన రాసినదరువులు అతిసులువుగా పాడదగి వుండటం ఆయన ప్రజ్ఞాప్రౌఢవాలకు ప్రత్యక్ష నిదర్శనం.

భక్తిరసభరితాలూ, ప్రబోధాత్మకాలూ అయిన ఆయన నాటకాలు ఈనాటికీ జన్మస్థానమైన తంజావూరుజిల్లాలో వార్షికంగా ప్రదర్శిత మౌతూంటాయి. వార్షికం జూన్ నెలలో జరుగుతూంటుంది.

(ఆంధ్ర వార పత్రిక.)

—మద్దాలి సత్యనారాయణశర్మ.

## కీ. శే. ప్రొ॥ శేషాద్రి

ప్రొఫెసరు: పి. శేషాద్రి గారు కీర్తిశేషులైరని వినుట కెంతయు చింతిల్లుచున్నాము. శ్రీ శేషాద్రిగారు నెల్లూరు వాస్తవ్యులు; శ్రీ వైష్ణవులు. విద్యాశాఖయందు ప్రవేశించి వివిధశాస్త్రములందు ప్రావీణ్యముతో వ్యవహరించి అజ్మీరునందు గవర్నమెంటు కాలేజీ ప్రిన్సిపాలు పదవి నధిష్టించియుండిరి. రాష్ట్రేతర ప్రాంతముల నత్యున్నతస్థాన మలంకరించిన ఆంధ్రప్రముఖులలో వీరొకరు. ఇట్టి వీరి అకాలమరణమువలన యావద్భారతదేశము అమూల్యమగు నొక విద్యాబోధకుని గోల్పోయినది.

—త్రిలింగ.

## కీ. శే. అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు

లోగడ మీ పత్రికకు ప్రథమములో సంపాదకులుగానుండిన శ్రీ విద్యాశేఖర అక్కిరాజు ఉమాకాన్తంగారి మరణవార్త గతసంచికయందు ప్రకటించియుంటిమి. శ్రీ ఉమాకాన్తంగారు గొప్ప పండితులు, ప్రతిభావంతులు విమర్శకులు వారి సిద్ధాంతములతో పూర్ణముగా మన మేకీభవింపజాలక పోవచ్చునుగాని వారి ప్రతిభావిశేషములు ప్రశంసింపకుండజాలము. ఇట్టి వీరి మరణము ఆంధ్రభాషకు తీరనినష్టము అని చెప్పకతప్పదు. భాషావిషయిక చర్చలయందట్టిదో వీరి ధైర్యసాహసములు అంతరంగిక జీవితమునందట్టిదే. కుమారుడు, కుమార్తె, ఇరువురు భార్యలు గతించి ఏకాకియై సంవత్సరముపైగా పక్షవాతముచే బాధపడుచున్నను ధైర్యమును వీడలేదు. వీరి మరణమునకై మ్రగ్గు వీరిశిష్యబృందమునకును,

మిత్రవర్గమునకు మా సామభూతిని తెల్పు చున్నాము.

—త్రిలింగ.

---

## ఆవుదూడలు

ఒక ఆవునకు కోడె, పెయ్యదూడలు పుట్టుటను గురించి అస్సాము రాష్ట్రము లోని ధుబ్రినగర నివాసియగు జే. సి. చక్రవర్తి బాబుగారు చేసిన పరిశోధనలు ఆశ్చర్యజనకములుగ నున్నవి. ఆయనవద్ద దొరతనమువారి ఆబోతుమంచి నారు. ఇతర ఆబోతులనుకూడ ఆయన పరిశోధించిరి.

ఉదయము 6 మొదలు 12 గంటల మధ్యకాలమున పొర్లిన యావులు కోడెదూడలను పెట్టెను. మధ్యాహ్నము 12 గంటలు మొదలు సాయంత్రము 6 గంటల మధ్యకాలమున పొర్లిన యావులు పెయ్యదూడల నీనెను. ఇట్టివి 28 నిదర్శనములు దొరతనమువారి ఆబోతువల్ల కొననయ్యెను. ఇటులనే యితర యావులలోను దృష్టాంత మిచ్చెను. మన వంగవోలులో నిట్టి పరిశోధన చేయదగ్గది.

—దు. ప్రకాశరావు.

---

## అబ్దుల్ గఫూర్‌ఖాన్ జీ

రాజకీయాలలో చేరక ముందు ఈయన చక్కటి పఠానురైతు.

ఈయనకు నాలుగు షోకైన ఎడ్లువుండేవి. 70 ఎకరాల పొలం వుండేది.

ఇద్దరు పాలేళ్లను వెంట వేసుకుని ఈయన స్వయంగా మేడి చేతపట్టి వ్యవసాయం చేసేవాడు.

ఈయన నివాసం సరిహద్దు రాష్ట్రంలో గల ఉట్మాంజై గ్రామం.

ఖాన్‌జీ వేకువజామున లేచేవాడు. గిత్తల తలుపులు విప్పి ముందుతోలి తానువెనుక బయలుదేరేవాడు.

ఊరికి మైలుదూరంలోవున్న కాలువ దగ్గిర ఆగి స్నానంచేసి తూర్పు తెకలారే వేళకు పొలానికి చేరేవాడు.

మిట్టమధ్యాహ్నందాకా పొలందున్నడం, బాగుచేయడం, బోదెలుతీయడం మొదలైన పనులు జేస్తూవుండేవాడు.

అప్పటికి ఇంటి దగ్గరనుంచి భోజనం వచ్చేది. ఖాన్‌జీ పని ఆపి, ఎద్దులను దక్కనవున్న చెట్ల తోపులోకి తోలివేసేవాడు. అక్కడ అవి మేతమేసి కాలునీళ్లు త్రాగి నెమరువేస్తూ నిద్రపోయేవి— చెట్లు విచే వింజామరల హాయి ననుభవిస్తూ.

---

## పాపాయి

ఏ విరుల తోటల విహరించినావో
ఏ దివ్య సీమల దిరుగాడినావో
ఏ స్వర్గలోకమున నివసించునావో
అప్సరసవో? నీవు అమరకన్నెకవో?
ప్రణయపూజలు మావి ఫలియించినాయి
జన్మించినావు యీ జనని గర్భమున
సౌందర్యమే లేదు సౌఖ్యమే లేదు
స్వార్థపరత్వమె యిచట పాలించునమ్మ
దారిద్ర్యదేవతను దినము కొల్చేము
ఇనుపగజ్జెలతల్లి యిలవేల్పు మాకు
దినదిన కష్టాలు దీర్ఘమైపోవ
బ్రతుకు ఒక భారమై బ్రతికేటి వేళ
దివ్య సీమలనుండి దిగినావు మాయింట
స్వర్గ సీమలవిడచి ఏలనొచ్చావు ?
అమరభూముల విడచి ఎందుకొచ్చావు ?
పొత్తిళ్ళలో నీవు పోరు పెట్టేవు
మూగనై గల నీవు మాటలాడెదవు
దేవభాషలు మాకు తెలియవేయమ్మ
మూగ నోములవల్ల సాగునే పనులు ?
మానవభాషలో మాట్లాడవే తల్లి
నీ కోర్కెలను మేము నెరవేర్చుతాము.

—జి. కోటయ్య

ఖాను తన అనుచరులతో కలిసి రొట్టెలు భుజించి ఒకటి రెండు గంటలు విశ్రాంతి తీసుకొనేవాడు. ప్రొద్దు పడమటకు వ్రాలగానే తిరిగి పని ప్రారంభించేవాడు.

ఖాన్‌జీ వ్యవసాయంలో అఖండమైన అనుభవం సంపాదించాడా రోజులలో.

తరువాత అతని దృష్టి రాజకీయాలపైకి మరలింది. గాంధీజీ అనుచరులలో అగ్రగణ్యుడైనాడు. అహింసావ్రత నిష్ఠాగరిష్ఠుడైనాడు.

ఇప్పటికీ ఖాన్‌జీ కొంచెం విశ్రాంతి చిక్కితే పల్లె పొలాలలో కూర్చుంటాడు. పిల్లగాలులతో ఆడుకుంటాడు, పైరు పొలాలతో కలిసి పక పక నవ్వుతుంటాడు.

—కృష్ణాపత్రిక.

—— ——

## ఎండ దెబ్బ : వడ దెబ్బ

మండు వేసవిలో ఎండదెబ్బవల్ల, వడదెబ్బవల్ల మరణాలు విస్తరించి వుంటాయి.

ఎండదెబ్బ. వడదెబ్బ ఒక్కటేనని పలువురు అనుకుంటారు. కాని ఆ రెండింటికీ చాలా తేడా వుంది.

ఎండదెబ్బ అన్నది సూర్యాతపం నేరుగా మీదపడడంవల్ల కలిగేది. వడదెబ్బ అన్నది సూర్యాతపంలో వుండకపోయినా కూడా కలగవచ్చు.

ఎండదెబ్బ అన్నది అకాత్తుగా తగులుతుంది. టెంపరేచరు తొందరగా ఎక్కిపోతుంది. రోగి స్మారకం లేకుండా పడిపోతాడు. అరగంటకుపైబడి అతనికి తిరిగి స్మారకం రావచ్చు. కాని రెండు మూడు రోజులవరకూ మాత్రం అతడు పూర్వపు ఆరోగ్యాన్ని పొందడు.

ఎండదెబ్బ తిన్నవారికి వెంటనే చికిత్స జరగాలి. రోగి కట్టివున్న బట్టలు వదులు చేయాలి. రోగి శరీరమంతా చన్నీళ్లతో కాని, మంచుతో కాని తడపాలి.

శరీరమంతా తడపడానికి వీలులేకపోతే అధమపక్షం ముఖం, గుండెకాయ వినా తడపాలి. టెంపరేచరు తాజా స్థితికి రావడంతోటే చన్నీళ్లులేక మంచు గడ్డ ఒత్తడం మానివేయాలి.

ఎండదెబ్బ తిన్నవాళ్ళకి గ్రామాల్లో ఒక చిన్న చికిత్స చేస్తారు. రోగి మెడ యొక్క వెనుకటి భాగానికి పచ్చిమామిడికాయ (తొక్కలు గీసినది) తొక్కి రుబ్బి పట్టువేస్తారు.

ఇక వడదెబ్బ రోగి సంగతి: ఈ రోగి ఎండలో మసిలి వుండకపోవచ్చు. ఈ రోగికి టెంపరేచరు మామూలు స్థితిలో కాని, దిగిపోయికాని వుండవచ్చు. నాడి నీరసంగానో, దుడుకుగానో కొట్టుకుంటుంది. చర్మం చల్లగా, జిగటగా వుంటుంది.

వడదెబ్బ తగిలిన చాలా కాలంవరకు నిస్సత్తువ, నీరసం వుంటుంది. ఈ నీరసంవల్ల, నిస్సత్తువవల్ల ఈ రోగులు సాధారణంగా చనిపోవడమే తటస్థిస్తుంది.

వెలవెలపాటు, తలనొప్పి, వికారము, కళ్లు మసకలు కమ్మడం— ఇవి వడదెబ్బకు పూర్వరూపాలు.

ఎండాకాలంలో ఈ లక్షణాలు కనిపించిన వ్యక్తి వెంటనే ప్రశాంతంగా వుండే శీతల ప్రదేశానికి పోయి విశ్రాంతి తీసుకోవాలి.

విసనకర్ర ఉపయోగించడం అవసరమైతే తలకు నేరుగా గాలి తగిలేట్లుగా విసరకూడదు.

వడదెబ్బ తగిలిన రోగికి స్మారకం తప్పిపోవడమంటూ వుండదు. కాని వడదెబ్బ గాటంగా తగిలినట్లయితే రోగి పాదాలవద్ద వేడినీటి సీసాలు వుంచి, శరీరమంతా వున్ని గొంగళికప్పి, తలకు మాత్రం మంచుగడ్డ ఒత్తడంతో చల్లగా వుంచాలి.

ప్రతి వేసవిలోనూ భారతదేశంలో ఈ రెండు దెబ్బలతోనూ చాలా మంది చనిపోతూ వున్నారు.

అన్ని వ్యాధుల్లోవలె ఈ వ్యాధుల్లో కూడా కుదర్చడంకంటె ఆటంకపరచడం మేలు. కాబట్టి ఇవి రాకుండావుండే మెలుకువలు వహించడం మంచిది.

వృద్ధాప్యము, రక్తపుపోటు, మితిమీరిన మాంసాహారం, తప్పతాగుడు, చీకు చింత—ఇత్యాదులు ఎండదెబ్బ, వడదెబ్బ తగలడానికి గల హేతువులలో కొన్ని.

వేసవిలో వదులైన పలచటి బట్టలు కట్టుకోవాలి.

చన్నీళ్లలో రోజూ స్నానం చేస్తూ శరీరాన్ని శుభ్రంగా వుంచుకోవాలి.

ఆహారం బాగా తేలికగా వుండాలి. ఉడకపెట్టిన ఆకుకూరలు, పచ్చి వస్తువులతో చేసిన పచ్చళ్లు ఎక్కువగా వాడాలి.

పిండి పదార్థాలు, మాంసపదార్థాలు ఎంత తగ్గిస్తే అంత మంచిది.

మంచినీళ్లు, పళ్ళరసం బాగా ఉపయోగించవచ్చు.

ఏదో ఒక ఆసవం పుచ్చుకోవడం అలవాటు వున్నవారు బ్రాందీ, విస్కీలను ఉపయోగించడంకంటె బీర్ ఉపయోగించడం గుడ్డిలో మెల్ల ఐ వుంటుంది.

—ప్రజామిత్ర.

## వేసవిలో బూడిదగుమ్మడి

బూడిదగుమ్మడికాయలను సంస్కృతమందు కూష్మాండలీ, బృహత్ఫలా, పుష్టఫలీ అంటారు. ఇది చలువచేసి నీరు పెట్టును, మూత్రము కావించును, జ్వరము పోగొట్టును, మంచిరక్తము బుట్టించును. కడుపులోనుండు వేడిమిని నణచును. దాహముకట్టును. మేహ, కాక శరీరములకు అనుకూలముగనుండును. వీర్యపుష్టి, బలము చేకూర్చును. సుగుణములు ఇంకా చాలవున్నవి. అందుకనే ముందుగా వేసవివస్తుందనేటప్పటికే సంక్రాంతివాడు బూడిదెగుమ్మడికాయను వుపయోగించుకొనుటకు డబ్బుతోకూడా దానము చేయాలన్న నిబంధన ముఖ్యంగా నేర్పఱచారు ఆకాలపు పెద్దలు! ఉత్తర హిందూస్థానీయులు గుమ్మడికాయను పలువిధములుగ వాడుచున్నారు. హిందూస్థానమునందు దీనికి మంచి ప్రాముఖ్యము లిచ్చుచు మిఠాయిలు, మురబ్బాలు, హల్వాలుగ చేసుకొందురు. ఇక ఆంధ్రులలో వడియాలు, ధప్పళములో ముక్కలుతప్ప బూడిదగుమ్మడిని అంత విరివిగా వాడరు. హిందూస్థానీయులు బూడిదగుమ్మడికాయకు, మంచి ప్రాముఖ్యమిస్తారు. దానినివారువాడే విధములు కొన్ని చెప్తాను.

బూడిదగుమ్మడి మురబ్బా:— ఈ మురబ్బాకు కృష్ణజన్మస్థానమగు మధురలో విశేష ప్రఖ్యాతికలదు. చేయు విధానము: గుమ్మడికాయను చెక్కుతీసి సన్నని వెదురుపుల్లలుకొన్ని కట్టగా కట్టి (ములుకులు చెక్కివుండవలె) లేనియెడల ముదిరిన ఈతయాకులు కట్టకట్టి బెజ్జములు పడునట్లుగాగుచ్చి ముక్కలుగా కోసి వుడుకవేయాలి. తదుపరి ఆ ముక్కలలో వుండేనీరు పోయేటట్లు గట్టిగపిండి కొద్దిగా నేయివేసి బానలిలో ముక్కవడపతేటట్లు వేయించాలి. తదుపరి బానలిలో, కాయను బట్టి పంచదారవేసి కొంచెము ముదురుపాకము (లడ్డుపాకము) వచ్చేటట్లుచూచి చేర్చి ఆముక్కలు వేసి కొంచెము ఉడకనిచ్చి దించవలెను. ముక్కలు కావలసినంత పానకము తీసుకొని రబ్బరుముక్కలులాగా వుంటవి, మంచి రుచికరము ఆరోగ్యముగా వుంటవి.

(షోబా) మరొక విధానము చెక్కుతీసిన పెద్దముక్కలు కొబ్బరితోరుముతో తోరిమి వుడకనిచ్చి మూటగట్టి నీరును బాగుగ పిండవలెను. లేకున్న పాకము త్వరితము కాకపోవుటమేగాక మిఠాయి త్వరితముగా చెడిపోవును- తీరిపోయిన ఆగుమ్మడి తీగెలు కొద్దిగ నెయి చేర్చి వేయించి నీరులేనట్లు తోచినపుడు వేరుగ వుంచి, కాయకు తగినట్లు పంచదార పాకము అపాకమువంగు. కుంకుమపువ్వులు, పన్నీరు, ఏలక్కాయలపొడి చేర్చి పాకము (బజారులలో తయారుచేయు పంచదార పూసవలె) ముదరనిచ్చి ఆపాకమున చేర్చి కలయత్రిప్పి దించి ఆరనిచ్చినచో పూసవలెనుండును. 20 రోజుల వరకు నిలువవుంచుకొనవచ్చును. పిండితో చేయబడిన మిఠాయిలకన్న మంచి రుచికలిగి వుండును.

హల్వా:—పైన వ్రాసినట్లు తోరిమి ఉండి పాకము పట్టువరకు కోవావలె చేయవలెను. పాకము అంత ముదురుగానుండకూడదు. ఇందులో కొందరు పాలకోవా చేర్చెదరు. మరికొందరు చేర్చరు. మిగతావస్తువులు అందరు వేయవచ్చును గసగసాలు, సార, బాదం, పిస్తా, అక్రోటు మున్నగు పప్పులు వేయించి వేయవలెను. పైవాటిలోవలె పచ్చకర్పూరము, ఏలక్కాయలపొడి కుంకుమపువ్వు పన్నీరు చేర్చవలెను. హల్వా పాకము వచ్చువరకు కొద్దికొద్దిగా మంచి నేతిని జేర్చి తయారైనపదప జాడిలోచేర్చి ప్రతిరోజు పూటకు ఫలము వంతున తినినచో సుగుణములను కలుగజేయును. ఆంధ్రసోదరులారా? బూడిదగుమ్మడి వడియాలు, కూరకేగాక భక్ష్యభోజ్యములుగ తయారు చెసుకొనుచు ఆరోగ్యానందము పొందెదరుగాక.

—వ్యాయామకళ.




---

## సింధులో హర్‌లు

సింధులోని హర్‌లు ఒక జాతివారు కారు. పీర్ పగారోకు అంకితులయివున్న సంఘసహోదరులు వారు. క్రీ. శ. 711 సింధులో వలసవెలకొన్న సయ్యద్ షా అలిమాఖినుంచి పరంపరగా పీర్‌షిప్ తలపాగా నేటి పగారోపీర్‌కు సంక్రమించింది. హర్ అనేదానికి మతసంబంధమైన అర్థముందంటారు. కొందరు వీరిని 'లర్' అని పిలుస్తారు. లర్ అంటే అపవిత్రమైన అని అర్థం.

*—Statesman*

విమర్శక వ్యాసము :

# కవిరాజు ఉలిపి సిద్ధాంతాలు

## 'రాముడు సాపాటురామడు ప్రహ్లాదుడు పితృహంతకుడు'

రచయిత :
బి. వి. గోపాలకృష్ణరావు

ఇటీవల కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారికి గుడివాడయందు జరిగిన సన్మానసభలో వారు క్రిందివిధముగ ప్రసంగించినట్లు ఏప్రిల్ నెల 30-వ తేదీ ఆంధ్రపత్రికయందు కలదు.

అందలి ముఖ్యవిషయములు :

(1) శ్రీ రామచంద్రుండు పితృవాక్యపరిపాలనలో క్యాసబియాంకా కంటె గొప్పవాడుకాడు.

(2) భార్యను ఇతరుడు లేవదీసికొనిపోగా రాముడు శుద్ధ అప్రయోజకుడై యితరుల సహాయమపేక్షించి తెచ్చుకొన్నాడు.

(3) రాముడు మాయామానుషవిగ్రహుడన్నప్పుడు మాయ అనగా అజ్ఞానమనియు, అజ్ఞానమనగా నిరక్షరత్వమనియు అర్థము.

(4) ప్రహ్లాదుడు పితృహంతకుడు.

వారి ఈ మాటలకు నా విమర్శ:

(1) క్యాసబియాంక : ఫ్రెంచి వారికిని, అమెరికా బ్రిటిష్ వారికిని 1798 సంవత్సరము ఆగష్టు 1-వ తేదీ జరిగిన 'నైల్' నౌకా యుద్ధమునకు సంబంధించి—ఆంగ్లేయ విదుషీమణి యఫ్. హెమాన్స్ చే వ్రాయబడిన కథ. నేవల్ ఆఫీసర్ పుత్రుడు క్యాసబియాంక, 10 సంవత్సరముల బాలుడు. తన తండ్రి యాజ్ఞచొప్పున యుద్ధపు నౌకయందే యుండెను మరియొక యుద్ధపు నౌకలో తండ్రి మరణించెను. తన తండ్రి మరణించినది తెలియక తండ్రి ఆజ్ఞకై వేచియుండగా ఆనౌకకు సహా అగ్ని అంటుకొని ఆ బాలుడు అందే మరణించెను. ఈ బాలుని ధైర్య సాహసములు మెచ్చదగినవే. శ్రీరాముడు వివాహము చేసికొని పట్టాభిషేకమునకు సిద్ధముగానుండిన యువకుడు. వీరాధివీరుడు. తలిదండ్రులను, రాజ్యమును సకల సౌఖ్యములను త్యజించినాడు, తండ్రిమాట శిరసావహించి కాననములకు పోయినాడు. ఏలాటి ప్రపంచజ్ఞానము, ఏలాటి ఐహికసుఖముల నెరుగని 10 సంవత్సరముల బాలుడు క్యాసబియాంకా సముద్ర మధ్యమున మండుచుండెడు నౌకయందు తగులుకొని వేరు విధిలేక దగ్ధమైనాడు ఇందు ఎవరి పితృభక్తి మెచ్చదగినదో విజ్ఞులే పరిశీలింపవలయును.

(2) ఒక దుష్టుడు రాముడింట లేని సమయమున మాయవేషమున అతని భార్యను ఎత్తుకుపోయినప్పుడు అతడేమి చేయవలయునని కవిరాజుగారి సలహా? నెత్తిన గుడ్డవేసికొని ఒక మూల కూర్చుండి విలపించుచుండుమనియా? ఈ కలియుగములో ఎట్లున్నను ఆ యుగములో దుష్టశిక్షణము పాలకుల కర్తవ్యము. దేశమందంతట శాంతి నెలకొల్పుట క్షత్రియుల ధర్మము. శ్రీరాముడు సుక్షత్రియుడగుటజేసి తన భార్యను దొంగతనముగా తీసికొనిపోయిన రావణుని అతని అనుచరులగు తదితర దుష్టదానవులను సంహరించి భారతదేశమందంతట శాంతి నెలకొల్పి 'రామరాజ్య'మని ప్రజలచే మెప్పు

పొందె. రాజశేఖరుడు రాముడు. అట్టి వానిని అప్రయోజకుడని కవిగారు అనుటలో వారి అభిప్రాయము వ్యక్తమగుట లేదు. దుష్టుల సంహరించుటకు యితరుల సహాయమపేక్షించుట తప్పని మన కవిరాజుగారి అభిప్రాయమైనట్లు తోచుచున్నది.

శ్రీరాముడు కిష్కింధ మున్నగు ప్రదేశములందుండిన అడవి జాతివారి సహాయ సంపత్తితో తన కార్యమును సాధించుట ధీర లక్షణము కాని వేరొండు కాదు.

(3) రాముడు మాయామానుషవిగ్రహుడనగా చదువు సంధ్యలు లేని సాపాటురాముడని మన కవితల్లజుని యభిప్రాయము. శ్రీరాముడు ఆ కాలములో వాడుకలో నున్న సంస్కృతభాషయందు అఖండమైన పాండిత్యము సంపాదించి యుండవలయునని రామాయణము చదివిన విజ్ఞులకెల్లరకు దోపకమానదు. శ్రీ రాముడు భారత దేశమందంతట హిందువులచే పూజింపబడుచున్నాడు. మదరాస్ జనరల్ హాస్పటలు యందు 1916–17 సంవత్సరములలో సూపరెంటెండెంటుగా పని చేసిన మేజర్ నిబ్లాక్ ఐ. యం. యస్. (ఐరోపీయుడు) అతని సతి ప్రొద్దున పడకనుండి లేచుచుండగనే రామునిపటము ముందుపెట్టుకొని పూజించి ఆవల కాఫీపుచ్చుకొనెడివారు. బహుశా మన కవిరాజుగారి కున్న విజ్ఞానము ఈదొరకు లేకుండెది కాబోలు!

(4) తండ్రి హిందువుగ నుండుట, పుత్రులు క్రీస్తుమతమునో, బ్రహ్మసమాజ మతమునో, లేక బౌద్ధమతమునో స్వీకరించుట మనము చూచుచున్నాము. అందువలన తండ్రులు తమ పుత్రుల కెట్టిహాని యు గావించినట్లు విని యెరుగము.

హిరణ్యకశిపుడు శివభక్తుడు. ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు. ప్రహ్లాదుడు తన తండ్రినిగాని శైవమతమునుగాని దూషించినట్లు భాగవతమం దెచ్చటను చెప్పబడియుండలేదు. విష్ణునియందుండు ద్వేషముచేత హిరణ్యకశిపుడు తన కుమారుని పర్వతములనుండి క్రిందికి పడ ద్రోయించె, సముద్రమధ్యముల ద్రోయించె, ఏనుగులచే ద్రొక్కించె, విషము నిప్పించె. అతడు చచ్చుటకై విశ్వప్రయత్నముల గావించి తుదకు విఫల మనోరథుడయ్యె. ఇన్ని క్రూరకృత్యముల గావించినను ప్రహ్లాదుడు తనతండ్రి యెడల భక్తి శ్రద్ధలతోనే మెలగె. హిరణ్యకశిపుని సంహరించినది స్తంభమునుండి ఉద్భవించిన నరసింహుడుగాని ప్రహ్లాదుడుగాడు. తన తండ్రిని చంపమని ప్రహ్లాదుడు నరసింహునికి 'శిఫారస్' సహా చేసియుండలేదు. అట్టితరి, ప్రహ్లాదుడు పితృహంతకు డెట్లయ్యెనో కవిరాజుగారు జవాబు చెప్పవలసియున్నది.

## చెణుకులు

ఈనాటి కాలేజీ గరల్సు పెళ్లి చేసుకున్న తరవాత వంటచేసేటప్పుడు వహించవలసిన గొప్ప మెలుకువ ఏమిటంటే తమ సిగరెట్టు నుసి వంటకాల్లో పడకుండా చేయడం.

... ... ...

ధనవంతుడైన నా పెత్తండ్రి చనిపోయాడు. విల్లులో అతడు నేను అతనికి బాకీవున్న పైకాన్నంతా నాకిచ్చివేసినట్లు వ్రాశాడు.

... ... ...

రష్యారాణి కాథరైన్ తన కోర్టుకు వచ్చే మగవాళ్లు అందరూ ఆడవస్త్రాలు ధరించీ, ఆడవాళ్లందరూ మగవస్త్రాలు ధరించీ రావాలని శాసించింది.

... ... ...

తన భార్య వెచ్చించే దానికంటే ఎక్కువ పైకాన్ని ఆర్జించగల భర్త తన జీవితాన్ని జయించినట్లే. అట్టి భర్తను సంపాదించగలిగితే ఆ భార్యకూడా తన జీవితాన్ని జయించినట్లే.

... ... ...

యు పి. లోని జిల్లా మేజిస్ట్రేట్‌లు, జిల్లా జడ్జీలు, ప్లీడర్లు కోర్టుల్లో చుట్ట కాల్చడమూ, తాంబూలం వేయడమూ చేయకూడదని అలహాబాదు హైకోర్టు వారు ఒక తాఖీదు జారీ చేశారు.

ఇట్టి తాఖీదును మదరాసు హైకోర్టు వారుకూడా జారీచేసినా తూర్పుగోదావరిజిల్లా అమలాపురంలోని పెద్ద ప్లీడరుకి ఏమీ భయం వుండదు.

ఏమంటే ఆయన కోర్టులో చెవుగోడీలు పటపటలాడిస్తారే కాని చుట్ట కాల్చడం, తాంబూలం వేయడం మొదలయిన అసభ్యపు పను లేవీచేయరు కాబట్టి.

## కలుకులు

నియంత లందరూ అల్లరిపిల్లకాయలు. చచ్చేవరకు వారు ఇంకా కావాలి, ఇంకా కావాలి అంటూ వుంటారు.

*—Phyllis Bottome*

... ... ...

స్త్రీలు మగలపట్లకంటె పిల్లలపట్ల ఎక్కువ శాంతమూర్తులయి వుంటారు. పురుషులో? తమ పిల్లలపట్లకంటె ఇల్లాళ్లపట్ల ఎక్కువ శాంతమూర్తులయి వుంటారు.

*—A. Pemberton*

... ... ...

ఒక్క కన్ను మూసుకునివినా పెద్ద వస్తువుల్ని, సంగతుల్ని చూడగలవు. చిన్న సంగతులు చూడ్డానికి రెండుకళ్లు తెరుచుకుని వుండు. చిన్న సంగతుల విషయకమైన జాగ్రత్తయే మనిషిని జయపథంలో పెడుతుంది.

*—Forbes*

... ... ...

నోరు తెరిచి చేసి ఇతడు మూర్ఖుడురా అని నిర్ధారణగా అనిపించుకోవడంకంటె మౌనం వహించి ఇతడు మూర్ఖుడేమోరా అనే అనుమానాన్ని మాత్రం కలిగించడం మంచిదై వుంటుంది.

*—Lincoln*

... ... ...

తాను చిన్న జీతగాడననే సంగతి రహస్యంగా వుంచుకోడానికిగాను ఎక్కువ సొమ్ము వ్యయించకుండా వుంటే తప్ప చిన్న జీతంతో ఐనా సుఖంగా జీవించడం కష్టతరమైన విషయం కాదు.

*—St Louis Star*

... ... ...

## విజ్ఞాన విషయాలు

టురుష్క ప్రజాస్వామికం ఏర్పడి ఇప్పటికి పద్ధెనిమిది సంవత్సరాలు ఐంది.

... ... ...

ఇప్పుడు ప్రపంచంలోని వివిధదేశాల్ని పరిపాలిస్తూవున్న రాజులందరిలోకి మిక్కిలి చిన్నవాడు ఇరాక్ రాజయిన రెండవ ఫీజెల్. అతనికి ఇప్పుడు ఆరో ఏడు.

... ... ...

టెలిస్కోప్ సాధనాన్ని కనిపెట్టినవాని పేరు హాన్సులిప్పర్‌షే. అతడు డచ్చి జాతీయుడు. పదిహేడో శతాబ్దికి చెందినవాడు.

... ... ...

స్పెయిన్ నియంతఐన ఫ్రాంకోకి స్పానిష్‌భాషలో ఎల్ కాడిల్లో అని బిరుదు.

... ... ...

1713 లో జరిగిన యూట్రెట్ సంధి తరువాత గ్రేట్ బ్రిటన్ జిబ్రాల్టరును స్వాధీనం చేసుకుంది.

... ... ...

మెడగాస్కరు దీవిని ఆ దీవిలోని ఆదిమవాసులు 'చంద్రుని దీవి' అనే పేరుతో పిలుస్తారు.

... ... ...

ఐర్లాండుకు సెయింటుల దీవి అనే మారుపేరు వుంది.

... ... ...

స్కైదీవికి పొగమంచుదీవి అనే మారుపేరు వుంది.

---

పక్షుల్లో మాట్లాడగలవి రామచిలుకలే. రామచిలుకలు అట్టే ఎత్తుకు ఎగరలేవని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు.

*—Wilbur Wright*

# సంపాదకుడి లక్షణాలు

పత్రికాసంపాదకుడవు కావాలని నువ్వు ఉబలాటపడుతున్నావా? అయితే యీ లక్షణాలు నీకు వున్నాయో లేవో బాగా చూచుకో!

రచయిత:

## నక్షత్రకుడు

రచయితగాకంటె సంపాదకుడుగా వుండగలిగే తాహతు—

* * *

వృద్ధ వితంతువులా రోజులతరబడిని ఏకాదశీవ్రతాల ననుష్ఠించగల దేహపుష్టి—

* * *

డబ్బుకంటె పేపర్లో ఫొటో, కనీసం పేరుపడటమే చాలుననే నిష్కామత్వం—

* * *

మొదటితేదీ కోసం స్వాతివానకు ముత్యపుచిప్పలా ఎదురుచూస్తూ వుండకుండా వుండగలిగే నక్కాద్రాక్షపళ్ళతత్వం—

* * *

సంసారం లేకుండావుండడం, కనీసం వున్నా బాధలేని సంసారం కలిగి వుండడం—

* * *

గోల్డుఫ్లేకు సిగరెట్టు పెట్టెలో దక్కన్ సిగరెట్లు పెట్టుకొని కాలక్షేపం చేయడం.—

* * *

రచనలో ప్రతినిత్యమూ విసురుతూ వుండడానికి కొన్ని పడికట్టురాళ్ళుగల మాటల సంచీని కలిగి వుండడం—

* * *

జారుకుచ్చులపంచి, పొడుగు చేతుల లాల్చీ, కళ్ళజోడు, అకు చెప్పులు, తోలు సంచి మొదలైన సామగ్రితో నిత్యాలంకారం చేసుకోవడం—

* * *

కాఫీటైముకు హోటళ్ళముందు పని లేకపోయినా వాళ్ళతోను వీళ్ళతోను విసువులేకుండా హస్కుకొట్టగలగడం—

* * *

పేపరు మడచుకోవడం దగ్గిర్నుంచి స్టాంపులు అంటించుకోవడందాకా చేతనైవుండడం—

* * *

జీవితంలో రెండు చిన్న హిందీ కథల అనువాదాలు, కనీసం రెండు భావగీతాలు గిలికివున్న ప్రజ్ఞ—

* * *

మన దేశాన్ని గురించి ఏమీ తెలియకపోయినా రష్యానుగురించీ, వీలయితే చైనానుగురించీ కూడా బాగా తెలిసివుండడం—

గాంధిగారిని దూషించమన్నా, భూషించమన్నా సంసిద్ధమయ్యే చాకచక్యం—

* * *

తెరకట్టినట్లుగా కాక, గోడకట్టినట్టువుండే గ్రంధసంగ్రహంచేయగల నైపుణ్యం—

* * *

పుస్తకాలను చదవకండా వ్యూలను దంచగల నేర్పు—

* * *

మీటింగుల్లో ఉపన్యాసాలు, కనీసం అగ్రాసనాధిపత్యం నిర్వహించగల శక్తి—

* * *

ఆఫీసు మేనేజరు విసుక్కుంటూ వున్నా చిరునవ్వు ఒలికించగల అభావవైరాగ్యం—

* * *

నిద్ర, నీళ్లతో నిమిత్తం లేకండా గొడ్డులా పనిచేయగల ఓపిక—

* * *

ప్రత్యుత్తరాలకోసం రచయితలు పంపిన స్టాంపులతో పెళ్లాం పిల్లలకి ఉత్తరాలు రాసుకోగల సర్వసమత్వబుద్ధి—

* * *

కాఫీహోటళ్ళలో బిల్లు చెల్లించగలిగే స్నేహితులను సంపాదించగలగడం—

* * *

స్వార్థంలేని పరార్థ జీవులమనీ, మంచి భవిష్యత్తు వున్నదనీ సంతుష్టిపడుతూ, ఊహాసౌధాలలో షికార్లు చెయ్యడం.—

# కన్నెగులాబీ కరుణగాథ

[౨౬౭-వ పేజీ తరువాయి.]

అతడన్నాడు "ప్రియా! విశాల రమణీయమైన నా స్వప్న వనులలో మన మిద్దరం విహరిస్తూ ..." అని అంటూ అతడు చేస్తూ వున్న అభినయం, అతని ఉద్రేకం చూస్తే, ఆ ఉత్సాహ ప్రసంగం అంతా నన్నుచూచి చేస్తున్నాడని నాకు ఆనందం జలలా పుట్టుకొచ్చి ఓ వెర్రిగంతు వేశాను.

ఆనందపారవశ్యంలో గెంటిన ఆగింతుకు గభేలున క్రిందపడిపోయాను బోర్లా. నా తలకి చిన్న దెబ్బతగిలి నాకెంతో బాధ కలగ జేసింది. కాని, ఇంతలోనే ఆరాణి నన్ను తన మృదువైన వ్రేళ్లతో పాముతూ, నన్ను లేవనెత్తింది. నాకు నెప్పి అంతాపోయి ఎంతో సంతుష్టి కలిగింది.

కాని, ఇంతలో తిరిగి నాకు కష్టం సంప్రాప్తమైంది. నన్ను తీసుకువచ్చిన ఆ యువకుడు వెళ్లిపోయాడు.

నా కిప్పుడు ఐదోఏడు.

అతడు వెళ్లిపోయిన తర్వాత నేను మెత్తటి సిల్కులావున్న ఒక పదార్థంమీద పడవేయబడ్డాను. నా మోహంమీద నేను భరించలేనంత బరువు గుండ్రంగా, నల్లగా, కొంచెం మృదువుగా వుంచబడింది. అప్పుడు నాకు కలిగిన బాధ, కోపం నేను వర్ణించలేను. అలా బాధపడుతూ పూర్తిగా పన్నెండు నెలలు వున్నాను. ఈ వ్యవధిలో నన్నా బరువు బాగా నలిపివేసింది.

నా సంతోషం అంతా అడవిని గాచిన వెన్నెలయి పోయింది. రోజులు గడిచిపోతున్నాయి. కాని నేనింకా ఆ బరువు క్రిందనే వుండిపోయాను.

ఆరో జన్మదినంనాడు నామీద వున్న బరువు—దానిలో మెదడు వుంటుందట—లేచిపోయింది. నా రాణి నన్ను బయటకు తీసి కుర్చీలో కూర్చుంది. అక్కడే మా జాతి వాళ్లు ఇంకా కొంతమంది వున్నారు. వాళ్లందరూ నాకేసి చూచి నవ్వ నారంభించారు. నా రాణి నన్ను మెల్లిగా ఎత్తి చేత్తో పట్టుకుని బొటనవ్రేలితోను, చూపుడు వ్రేలితోను నన్నులాగుతూ తన పెదిమల మధ్య పెట్టుకుంది.

అప్పుడు నే ననుకున్నాను. "నా జన్మ నే ననుకున్నంత నిరర్థకమైంది కాదులే..." అని.

ఇంతలోకి ఆమె దాసి వచ్చి ఏదో చెప్పి వెళ్లిపోయింది. నా రాణి గబగబా నా రేకలనన్నిటిని ఒకటొకటిగా తీసి తినివేయ నారంభించింది.

నాకెంతో కష్టం కలిగి ఆమె వైపు తెల్లబోతూ చూచాను. కాని ఆమె అలా నమలడం మాత్రం మానలేదు.

ఆమె నా దళాలనన్నిటిని తినేసి, నా వట్టి దేహాన్ని ఓమూరు తేరి పారిచూచి దూరంగా గిరవాటేసింది, నన్ను ఎంతో అవమానపరుస్తూ.

జరిగిన నిరసనకు, నిరాదరణకు నాకు ఉబ్బెత్తుగా దుఃఖం పొర్లి పొర్లి వచ్చింది.

నన్నా యింటికి తీసుకొనివచ్చిన యువకుడు వచ్చి నా ప్రక్కను నిలబడ్డాడు, అతనికేసి నేను చూచాను. కాని వికలాంగినై యున్న నా ఆకారాన్ని అతడు గుర్తించలేకపోయాడు.

నాకు కలిగిన అవమానాన్ని తీర్చుకునేందుకు అతణ్ణి గట్టిగాతిట్టి, అతణ్ణి శపిద్దామనుకుంటూ వున్నాను. కాని, మొదట యీ ప్రపంచంలో ఎలా మెలగాలో నాకు బోధించడానికి వచ్చిన రాజవార్తావహుడు తిరిగివచ్చి నన్ను ప్రక్కకు తీసుకొనిపోయాడు. నన్ను ఓదారుస్తూ, తన చేతుల్లోకి నన్ను తీసుకుని, రంగురంగులతో నిండి, మధురాతి మధురమైన ఒక వింత ప్రదేశంలో నన్ను జారవిడిచాడు.

నన్నా ప్రదేశంలోకి తీసుకు వెల్తుతూ అతడు నాతో ఇలా అన్నాడు: "ఇకమత్యమే జీవితము. జీవితమే సౌందర్యము. ఆ సౌందర్యానికి ఒక విహితకృత్యము ఉన్నది. దానిని నీవు నెరవేర్చావు. నీ జీవితం సంపూర్తి అయింది" అని.

# చెరుకుతోటల్లో ఫ్రాంసుబాట

## హిందూమహాసముద్రంలో మారిషియస్ దీవి

అక్కడ మాట్లాడబడేది ఫ్రెంచి భాష

ఐనా అది బ్రిటీష్ క్రౌన్ కాలనీ—

అక్కడి ప్రజలు పలువురు ఫ్రెంచివారు

ఐనా వారు బ్రిటీష్ విజయాభిలాషులు —

ఈనాటి యుద్ధంలో కొన్నికొన్ని దీవులకు ఎక్కడలేని ప్రాముఖ్యము వస్తావుంది.

నేడు అట్లా ప్రాముఖ్యాన్ని సంతరించుకున్న దీవులలో మారిషియస్ దీవి ఒకటి.

మారిషియస్ దీవి ఏమంత పెద్ద దీవికాదు. కాని అది బ్రిటీష్ క్రౌన్ కాలనీ.

దాని ఉనికినిపట్టి అది హిందూ మహాసముద్రయుద్ధంలో ప్రముఖపాత్ర వహింపడం ఖాయమైవుంది.

కేప్‌టవున్‌నుంచి ఇండియాకు వచ్చే నావికమార్గంమీద అది మెడగాస్కరుదీవికి 530 మైళ్ళ తూర్పునవుంది.

మారిషియస్ దీవి రాజధాని పోర్టులూయి. అక్కడ ఒక చక్కని నౌకాశ్రయమున్నది. అచ్చటి నేవల్ డాక్ యార్డు ఇటీవల కొంతవరకు విస్తృతి పొందింపబడింది.

హిందూ మహాసముద్రంలో మారిషస్ దీవివునికి కీలకస్థానంలో వుందని ఈవరకే చెప్పబడివుంది. ఆఫ్రికా చివురునవున్న కేప్‌టవున్ నుంచి సింహళద్వీపంలోని కొలంబోవరకుగల సముద్రమార్గపుదూరము 4710 మైళ్ళు. ఈ రెంటికీ మారిషస్ దీవి సరిగ్గా మధ్యలోవుంది.

మారిషస్ పొడుగు ముప్ఫయి తొమ్మిది మైళ్ళు; వెడల్పు ఇరవయి తొమ్మిది మైళ్ళు, దీవి అంతా కొండలు. అవి అగ్నిపర్వతాల వల్ల ఏర్పడ్డవని స్పష్టంగా తెలుస్తుంది. అచ్చటి ప్రకృతి చాలా రమణీయకంగా వుంటుంది.

మారిషస్ దీవిమీద మొదట నివాసం ఏర్పరుచుకున్న పాశ్చాత్యులు పోర్చుగీసువారు.

వారు అక్కడికి మొదట 1505 లో చేరారు. అంతకుపూర్వం అక్కడ మానవులు నివశిస్తావుండిన ఆనమాళ్ళు ఏవీ వారికి కానరాలేదు.

పోర్చుగీసువారయినా అక్కడ చిరకాలం వుండలేదు. అచిరకాలంలోనే వారు ఆ దీవిని వీడిపోయారు. 1598లో ఆదీవిలో డచ్చివారు ప్రవేశించారు.

తమదేశంలోని నాసూకు చెందిన ప్రిన్సు మారిస్ అనువాని పేర వారు దానికి మారిస్‌దీవి అన్నే పేరు వుంచారు. వారున్నూ అక్కడ చిరకాలం వుండలేదు. 1710 లో వారు దానిని వదిలిపెట్టివేశారు.

ఐదేళ్ళ అనంతరం అక్కడ ఫ్రెంచివారు వలస నెలకొనడానికి ప్రారంభించారు. వారు ఆదీవి నామాన్ని ఐల్ డి ఫ్రాన్సు (ఫ్రాన్సు దీవి)గా మార్చారు.

ఫ్రెంచివారు వలసనెలకొన్నప్పటినుంచి ఆదీవి అదృష్టరేఖ బయలుపడింది, కాని నెపోలియన్ కాలంనాటి యుద్ధాలతో ఆదీవి చరిత్రలో మరి ఒకసారి వ్యత్యస్థం ఏర్పడింది.

1810 లో ఆదీవిమీద బ్రిటీష్‌వారు ఎత్తివెళ్ళారు. ఫ్రెంచివారికి, బ్రిటీష్‌వారికి బహువారాలు

## హిట్లర్‌కి పిచ్చివాళ్ల శాల్యూట్

హిట్లర్ ఇటీవల ఒకసారి ఒక పిచ్చి ఆసుపత్రిని చూడబోయినాడు. ఆ సందర్భంలో రోగులందర్నీ వరుసగా నిలబెట్టి హిట్లర్‌కి శాల్యూట్ చేయవలసిన పద్ధతులు నేర్పారు.

ఆసుపత్రికి హిట్లర్ రాగా వరసగా నిలబడివున్న వారందరూ హిట్లరుకి శాల్యూట్ చేసి 'హీల్! హిట్లర్!!' అని జయధ్వానాలు చేశారు.

ఆవరసలో ఆఖరునవున్నవాడు మాత్రం శాల్యూట్ చేయలేదు, జయధ్వానం చేయలేదు.

హిట్లరు ఇది గమనించాడు. గద్దిస్తూ అతణ్ణి ఇల్లా అడిగాడు. 'నేను ఎవర్నో తెలుసునా? నాకు శాల్యూట్ ఎందుకు చేయవు?'

వినయ వినమితుడై అతడు 'నేను ఈ ఆసుపత్రిలో డాక్టర్ని. పిచ్చివాణ్ణి కాను' అన్నాడు.

---

యుద్ధం నడిచింది. 1814 లో జరిగిన పారిస్‌సంధివల్ల గ్రేట్‌బ్రిటన్ ఆదీవిని పొందింది. ఆదీవికి గ్రేట్ బ్రిటన్ తిరిగి మారిషియస్ నామాన్ని ఇచ్చింది.

మారిషియస్ బ్రిటీష్ క్రౌన్ కాలనీ ఐనా అచటి జనులు వారివారి మతవిషయంలోనూ, ఆచారాల విషయంలోనూ విశేష స్వాతంత్ర్యాన్ని కలిగివున్నారు. ఆదీవిలో పలువురికి తెలిసిన భాష ఫ్రెంచి భాష.

ఉనికిచేత అది కీలకస్థానంలో వుండడమే కాకుండా వ్యవసాయక రీత్యాకూడా ఆదీవి వరణీయ స్థానంలోనే వుంది. అచటి పొలంలో నాలుగింట మూడువంతులు చెరుకు పంటకు ప్రత్యేకింపబడివుంది. అక్కడి పంచదార పేరొందిన తగింది. ప్రభుత్వంవారే ఆ పంచదారనంతా కొనివేస్తారు.

చెరుకు పొలాలు చాలా వున్నాయి; విస్తృతమైకూడా వున్నాయి. ఈ పొలాలనడుమ ట్రాముబాటలు వున్నాయి. అక్కడ పడవలునడిచే కాలవలు లేకపోవడంచేత ఈ ట్రాముబాటలకు అవసరం ఏర్పడింది. ఆదీవిలో 120 మైళ్ళ రైలుబాటలువున్నాయి.

మారిషియస్ జనాభా నాలుగు లక్షలమంది. ఇందులో ఎక్కువమంది చెరుకు పొలాల్లో పనిచేసే వ్యవసాయపు కూలీలే.

చెరుకుపంటకు ఏమాత్రం చెరుపుకలిగినా ఆదీవిలో ఆర్థికమాంద్యం ఏర్పడుతుంది. 1931 లో కలిగిన తుపాను చాలా నష్టాన్ని కలిగించింది. అందు మూలాన్ని కొన్ని కుటుంబాలు బొత్తిగా ఎత్తుపడిపోయాయి. ఆదీవికి తుపానుల పీడ తరుచు. ఆ తుపానుల వల్ల ప్రాయకంగా ప్రాణాపాయంకూడా వుంటూవుంటుంది.

## ఖైదులోవున్న కాంతల కావేషీలు

ఖైదులోవున్న కాంతల ఆహంభావం జగత్ప్రసిద్ధమైనది. పవుడరు కోసం గోలచేస్తారు. అక్కడ తాను చూచే పురుషులు కొద్దిమందే ఐనా వారిని ఆకర్షించడంకోసమని వాళ్ళు అనేక అవస్థలు పొందుతారు.

ఖైదులోకి తోసివేయబడ్డ ఒక యువతినిచూచి షేరిఫ్ ఒకడు ప్రేమించాడు ఆమెమీద మోపబడ్డది హత్యానేరం. ఆషెరిఫ్ సొంతడబ్బు ఖర్చుచేసి ఆమెతరఫున ప్లీడర్ని పెట్టి వాదింపచేసి ఆమెను విడుదలచేయించాడు. అనంతరం ఆమెను పెళ్లాడాడు.

ఖైదులోవున్న ఒక స్త్రీ ఆజెయిలు విజిటర్లలో ఒకడు అక్కడికి వస్తూవుండే రోజులలో తన్ను కోర్టుచేశాడనీ, తన ప్రేమకు ఒప్పుకొల్పి తన్ను పెళ్ళాడనందుకు పదివేలపౌనులు నష్టపరిహారమివ్వించవలసిందనీ కేసు పెట్టింది.

ఇంతకూ ఆకేసుపెట్టిన స్త్రీ కురూపి. విచారణమీద కేసు అబద్ధమని తేలగా ఆమెకు మరి ఐదు సంవత్సరాల అదనపు శిక్ష విధించారు.

---

మారిషియస్‌లోని ఆరోగ్యం అంత బాగా ఆరోగ్యప్రదమైనదని చెప్పలేము. తేమ ఎక్కువ. వేసవిలో వేడిమి హెచ్చు.

పోర్టులూయీ వాసులు ఒకప్పుడు సముద్రతీరాన్నేవున్న ఇళ్ళ

ల్లో వుండేవారు. వుంటూవుండగా అక్కడ ఒకసారి ఒక గోగిష్టి వాడు దిగడం తటస్థించింది. వాడు మలేరియాజ్వరంతో బాధపడుతూవుండినాడు. మారిషియస్ దోమలు అతని సంపర్కంవల్ల మలేరియా జ్వరకారక క్రిముల్ని లోగొన్నాయి. అందుతో అంతకు పూర్వం మలేరియాజ్వరం ఎట్లా వుంటుందో ఎరగని మారిషియస్ దీవి మలేరియాజ్వర దేవతకు విహారభూమి ఐంది.

మలేరియాజ్వరం ఆదీవిలోని తెల్లవారిని తన పొట్టను పెట్టుకుంది. మిగిలినవారు సముద్రతీర గృహాలను వీడి ఎత్తయిన కొండ ప్రదేశాలమీద ఇల్లు కట్టుకున్నారు.

నేడు అచటి కోర్టుల్లో ఇంగ్లీషు భాష వాడబడుతూవున్నా ఆ దీవిలో సామాన్యంగా వాడుకలో వున్న భాష ఫ్రెంచిభాషే అని చెప్పబడుతూవుంది.

అంటే ఫ్రెంచివారు విడిచిపెట్టిపోయినప్పటికీ మారిషియస్ దీవి మీది ఫ్రెంచిముద్ర అంతగా తొలగింపరానిదై వుందన్నమాట.

అయితే అంతమాత్రంచేత అక్కడి ఫ్రెంచివారు నేడు వీచీ ప్రభుత్వపు పక్షపాతులనిగాని, పెటెయిన్ అంటే ప్రియముపడే వారనికాని అనుకోకూడదు. మారిషస్ దీవిలోని ఫ్రెంచివారందరూ నేడు హృదయపూర్వకంగా మిత్రమండలి దేశాలపక్షం వహించి మిత్రమండలి విజయాన్నే హృదయపూర్వకంగా కాంతిస్తూ యుద్ధనిధికి విశేషంగా విరాళాలు ఇస్తూవున్నారు.

మారిషియస్ చెంతగల ఫ్రెంచివారి వెడగాస్కరు దీవిలోని ప్రధాననౌకాశ్రయాన్ని బ్రిటీష్‌వారు ఆక్రమించి వున్నారు. దీవిలో అక్కడక్కడ జపానీయులు వున్నారనీ, బ్రిటీష్ స్వాధీనంలో వున్న నౌకాశ్రయం డిగోసారీల్ మీద మే 30-వ తేదీని జపాన్ సబ్‌మెరయిన్‌లు దాడిసలిపాయి అనీ వార్తలు వస్తున్నాయి.

ఈ వార్తల దృష్టితో చూస్తే మారిషియస్ దీవిమీదకూడా జపానీయుల ఆశాదృక్పరిసారం వుందని తోచక మానదు. జపానీయుల దండయాత్రే వచ్చిననాడు మారిషియస్ దీవి ప్రజల రాజభక్తి మిత్రమండలివారికి మంచి అండగా వుండగలదు.

శత్రువు సముద్రంమీదుగా ఓడలలోవచ్చి మారిషియస్ దీవిమీదదిగడానికి వీళ్ళు అంతగా లేవు. కాని విమానాలమీద వచ్చి దిగడానికి వీళ్ళు లేకపోలేదు. ఉత్తరాన్ని, పూర్వోత్తరాన్ని, దీవి మధ్యలోనూ విశాలమైన మైదానాలు వున్నాయి. ఆమైదానాలు ఏడువందల అడుగులు మొదలు పదకొండు వందల అడుగుల వరకు గల ఎత్తులలో వున్నాయి.

## డాక్టర్ ఈడ్పుగంటి రాఘవేంద్రరావు

వైస్రాయి కార్యనిర్వాహకవర్గంలో సివిల్ డిఫెన్సు సభ్యుడుగా వుండిన. ఆంధ్రపుత్రుడు డాక్టర్ ఈడ్పుగంటి రాఘవేంద్రరావు అస్వస్థత వలన తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు.

లండన్‌లో వుండగా విమానాల దాడి ఫలితంగా అతనికి అనారోగ్య మేర్పడింది. పైగా ఇండియాలో ఉద్యోగం స్వీకరించడానికి అతను విమానంమీద రావలసి వచ్చింది. విమానయాత్రవల్ల అతని ఆరోగ్యం మరింత చెడింది. నడుమ కొంచెం నెమ్మది కలిగినా కార్యభారం తిరిగి అనారోగ్యాన్ని కలిగించింది.

ప్రభుత్వోద్యోగాలలో శిఖరమంటిన కొద్దిమంది ఆంధ్రపుత్రులలో అతను ఒకడగుట ఆంధ్రులందరూ అతను త్వరలో స్వస్థచిత్తుడు కావాలని కోరడం సహజం.

Printed at the Andhrabhumi Printing Works, 13 Mukhatal Street. Vepery P.O, Madras
Editor & Publisher : Andra Seshagiri Rao B.A.

* అచ్చుతీరి అమ్మకమునకు సిద్ధముగా ఉన్న శ్రీ ఆంధ్ర శేషగిరిరావు గారి గ్రంథములు

## ఆంధ్ర రమణీమణులు భా-౧

ఇందు — కాకతీయాంధ్రసామ్రాజ్యసింహాసన మధిరోహించి జనరంజకముగ, శత్రుభయంకరముగ రాజ్యమేలిన రుద్రమ్మ; ధరణికోట సింగపుపీఠి నెక్కి అసామాన్యముగ రాజ్యచక్రము త్రిప్పిన గణపమ్మ; ఆంధ్రదేశమున ఆడుదియై పుట్టిన మంత్రిరాక్షసుని అపరావతారముగా నాయకురాలను బిరుదుగాంచిన పలనాటి నాగమ్మ; కౌగిలిలోనున్న భర్తను దీవించి కరవాలమొసగి కదనరంగమునకంపిన మాంచాల; ప్రజారంజకముగ పెద్దాపుర సంస్థానమును పాలించి తురక ఫౌజుదారుని జారి పడకుండ జోహారొనర్చిన అభిమానస్వరూప రాగమ్మ; ఆమె చేతులనుండి ఆమె మనుమని ఏడు మాసముల కసుగందుని గ్రహించి పంచకరపాట్లుపడి అరసి రక్షించిన స్వామిభక్తిపరాయణ మహాలక్ష్మమ్మ; పతియగు రాయజగపతితో సహగమన మొనర్చుచు పతి విరోధియగు ఆనందరాజునకు తిరుగని శాపమిచ్చిన మహాపతివ్రతాతిలకముగు సీతమ్మ; రాణివాసపు స్త్రీలందఱకంటె ముందుగా దాను కత్తి కెరయై మానమెఱిగిన స్త్రీత్వమునకు మొదలి పేరైన బొబ్బిలి రాణి మల్లమ్మ; నిండు చూలాలయ్యు మానసంరక్షణార్థమై నిజప్రాణముల ఖడ్గమున కెరచేసిన రమణమ్మ — వీరల అద్భుత చరితలు ఆంధ్రాభిమానముతో ప్రస్తరింపబడినవి.

2-వ కూర్పు. 112 పుటలు. దళసరి కాగితములు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## ఆంధ్ర రమణీమణులు భా-౨

ఇందు — రణరంగమున వీరవిహారము విరమించి యింటికి వచ్చిన పతికి వీరసందేశమిచ్చి తిరిగి కదనభూమికి పంపి అతనికి వీరస్వర్గమిప్పించిన ఆంధ్ర వీరపత్ని చానమ్మ - మానముకొఱకు, మాటవాసికొఱకు తన్ను తాను పొడుచుకొని చనిపోయిన తంజావూరి తెనుగురాణి రాజగోపాలమ్మ - యీ రాజగోపాలమ్మ మనుమని చెంగమలదాసుని విశ్రాంతిసమయమున అరసి రక్షించి తన ప్రభుభక్తిని ప్రకటించిన దాది - మధుర ఆంధ్రనాయక రాజ్యపాలనమును మహనీయముగ సాగించి దానవిరతిని, ఆంధ్రభాషాభిమానమును అతిశయముగ ప్రదర్శించిన మంగమ్మ - ఖాందాసాహేబు మోసమునకు గుఱియైన మీనాక్షి - పథ్యముముట్టని పచ్చి బాలెంతరాలయ్యు తన సహగమనోద్యోగము నెఱవేరకపోగా పన్నీరుత్రాగి ప్రాణములు విడిచిన పతిప్రాణ ముత్తమ్మ ప్రజోపయోగమునకై శిశుసహితముగ బలివోయిన సంగమ్మ వీరల పవిత్రచరిత్రలు గలవు.

దళసరి కాగితములు. 100 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## కేయూరబాహుచరిత్ర

శిల్పము మెరయ మంచనమహాకవి రచియించిన కేయూరబాహుచరిత్ర అను పద్యకావ్యమును ఆధారముగ తీసికొని తేట తెనుగు వచనమున జనసామాన్యముకొఱకు వ్రాయబడినది. పెండ్లాడినవానిని సార్వభౌమునిగా జేయు వరమునొందిన మృగాంకావళియను నొక రాజకన్యను కేయూరబాహువను రాజునకు నతని ధర్మపత్నిచే భాగురాయణుడను నాతని మంత్రి నిజబుద్ధిబలమున వివాహము చేయించిన వృత్తాంత మిందలి ప్రధానకథ. నడుమ నడుమ చక్కని నీతికథలు పెక్కులు గలవు.

గ్లేజు కాగితములు. 90 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## ఆంధ్ర రాజభక్తులు

రాజభక్తి యనునది దేశభక్తికి పర్యాయపదముగా రాణించుచుండిన ఆంధ్రదేశపు స్వతంత్రయుగ చరిత్రలలో రాణించు రాజభక్తిశిఖామణులగు విశ్వనాథనాయుడు, యాచమనాయుడు, అబ్దుర్ రజాక్ లారీ, కంబసవస్వామి, తిక్కన మంత్రి, మహాలక్ష్మమ్మ, పాపారాయుడు, హనుమప్ప నాయుడు అను ఎనమండుగురి చరిత్రలను కీర్తించు గ్రంథము.

గ్లేజు కాగితములు. 104 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరి, మదరాసు.

REGD. No. M. 4204. ANDHRABHUMI Estd 1933.



# ప్రపంచవీరులు

రచయిత:

శ్రీ కొత్తపల్లి శ్రీ రామమూర్తి

గులాబిగుచ్ఛము

దేశభాషలందుతెలుగులెస్స

ప్రసూనము: ౧

గ్లేజు కాగితములు. 96 పుటలు. ప్రతి 1-కి 8 అణాలు. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరి, మదరాసు.